# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము.

సంపుటము 34 | ఫిబ్రవరి 1991 | సంచిక 2

ముఖచిత్రం : " శ్రీ సత్యసాయి విద్యాలయాల క్రీడోత్సవాలు— జనవరి 1991 " సందర్భముగా వివిధ విన్యాసాలలో పాల్గొన్న విద్యార్థినీ విద్యార్థులు మరియు ప్రైమరీస్కూల్ విద్యార్థులకు ప్రత్యేక బహుమతినందజేస్తున్న భగవాన్ బాబావారు.

....విషయసూచిక....





సంవత్సర చందా : తెలుగు లేక ఇంగ్లీష్ :

ఇండియా : రూ. 20/-, ఓవర్సీస్ : ఎయిర్ మెయిల్ రూ. 140/-
సీ మెయిల్ రూ. 70/- U. S. $ 4.5, £ 2.5 U. S. $ 9, £ 5.00

ఆంధ్రప్రదేశ్, అనంతపురం జిల్లా, ప్రశాంతినిలయంలోని శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్సులో పి. కె. సూరి చే "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు" తరపున ముద్రింపబడి, ప్రచురింపబడినది.
సంపాదకుడు : వి. కె. నరసింహన్.

# కాలము - కర్తవ్యము

"సంపదలు, ఆపదలు, రాకపోకలు సర్వమూ కాలమును అనుసరించును. మంచి చెడ్డలు కాలమునకు అధీనములు. కాలము లొంగదీయనిది ఏ ఒక్కటీలేదు".

"ఈశ్వరుడు కాలస్వరూపుడు"

దివ్యాత్మస్వరూపులారా !

కాలము భగవంతుని స్వరూపము. భగవంతుని "కాలస్వరూపాయనమః" అని ఋషులు వర్ణిస్తూవచ్చారు. కనుకనే కాలమును "సంవత్సరః" అని పిలుస్తూవచ్చారు. లోకమునందుగల చరాచర పదార్థములన్నియు భగవంతుని యందే ఇమిడి ఉన్నవి. అందుచేతనే భగవంతుని ''కాలగర్భుడ''ని అంటూ వచ్చారు. భగవంతుని "ధీరోత్తమ" అని ఋషులు వర్ణిస్తారు. ధీరోత్తముడు అనగా సంవత్సర స్వరూపుడని అర్థం. ధీరుడనగా తెలివితేటలు కలవాడనిగాని, మేధాశక్తి గలవాడని కాని భావించరాదు. మానవుని ధీశక్తిని ఎవరు భగవంతునివైపు మరల్చి ఆనందమును అనుభవించెదరో, అట్టి వ్యక్తిని మాత్రమే 'ధీరుడు' అని వేదం చెప్పుతూ వచ్చింది. భక్తుల యోగ్యతలు పురస్కరించుకొని, దానికి తగిన ఫలితమును అనుగ్రహించేవానికి "కాలస్వరూపుడు" అనిపేరు.

## కాలము - జీవితము

మనకు కాలమే భగవత్స్వరూపుడు. కాలము కంటె మించిన భగవత్స్వరూపము ఇంకొకటిలేదు. మనకు పుట్టుక, జీవితము, గిట్టుట— అన్నీ కాలములోనే ఇమిడి ఉంటున్నవి. కాలమును భగవత్స్వరూపంగా విశ్వసించి, కాలమును పవిత్రం గావించే కర్మలు ఆచరించాలి. ఒక్క క్షణమైన మనము వ్యర్థం చేయరాదు. కాలమును వ్యర్థంచేస్తే, జీవితమే వ్యర్థమైపోతుంది. పవిత్రమైన జీవితములో మనం అనుభవించే ఈ ఫలితములన్నీ మన కాలానుగుణ్యంగావస్తాయి. మన కర్మలయొక్క ఫలితమే మన అనుభూతులు. ఆనందంగాని,

దుఃఖముగాని, హెచ్చుతగ్గులు కానీ మన కర్మల యొక్క ప్రభావమే. కాబట్టి మంచి చెడ్డలు మన హస్తము నందే ఉంటున్నవి. మనము ఎట్టి కర్మలు ఆచరిస్తామో, అట్టి ఫలితములను మనం అందుకుంటాము. ఏవిధంగా కాలాన్ని సార్థకం చేసుకుంటామో, ఆవిధమైన ఫలమును మనము పొందుతాము. కాలస్వరూపుడైన ఈ సంవత్సరస్వరూపుని మనం అనుభవించటానికి ప్రయత్నించాలి.

## ఆదర్శ జీవితం - ఆధ్యాత్మిక జీవితం

భగవంతుడు లౌకిక సంపదలకుగాని, లౌకిక అధికారములకుగాని, లౌకికమైన శక్తులకుగాని లొంగునటువంటివాడు కాదు. ఒక ఆధ్యాత్మిక చిత్తమునకు మాత్రమే ఆతడు లొంగితీరును. లోకములో మనము గడచిన రాత్రులనే తిరిగి అనుభవిస్తున్నాము, మనము గడచిన పగళ్ళనే తిరిగి అనుభవిస్తున్నాము, కడిగిన ముఖమునే తిరిగి కడుగుతున్నాము, తిన్న కడుపునకే తింటున్నాము. మనము గడచిన సంవత్సరమునే తిరిగి గడుపుకొంటున్నాము. కానీ మనము ఉత్కృష్టమైన, ఆదర్శవంతమైన జీవితమును గడుపుకొనుటకు ప్రయత్నిస్తున్నామా? ప్రయత్నించుట లేదు. ఈ విధముగా కాలాన్ని గడుపుతూపోయిన- జీవితము యొక్క సార్థకత, ఆదర్శము, పరమావధి ఏమిటి? ఈ విషయమై ఏ వ్యక్తియును అధికముగా యోచించుటకు ప్రయత్నించుటలేదు. కనుకనే ఈనాడు యోచించవలసినది ఉత్తమమైన, ఆదర్శవంతమైన జీవితాన్ని ఆధ్యాత్మిక అనుభూతులతో, ఆదర్శప్రాయముగా మన ఆనందాన్ని అందించటానికి ప్రయత్నించాలి.

## సాధనే సాధ్యము - సాధ్యమే సాధన

సాధనలు చేస్తున్నాము. ఈ సాధనల యొక్క ఫలితమేమిటి? అని ప్రశ్నించుకుంటే, మనకేమాత్రం అర్థం కావటములేదు. ఇవన్నీ మానసిక సంతృప్తి నిమిత్తమై ఆచరించే ప్రక్రియలే. నా ఉద్దేశ్యంలో సాధన-సాధ్యము అని లేనేలేవు. సాధనే సాధ్యము, సాధ్యమే సాధన. ఈ సాధనలో ఏదో ఒక సాధనచేసి, తద్వారా దివ్యమైన అనుభూతిని అందుకోవాలనే భ్రమనే పొందుచున్నారు. ఇది మానసిక అల్పతృప్తి మాత్రమే. మనము సాధన చేయవలెనన్న అనాత్మభావమును త్యజించటమే నిజమైన సాధన. మన దృష్టిని అనాత్మనుండి-ఆత్మ వైపునకు మరల్చటమే సాధన. ఈనాడు ప్రపంచములో అనేక విధములైన జ్ఞానములు పొందుచున్నాము. కానీ, ఇవన్నీ సరియైన జ్ఞానములు కావు. ఇది ఏ పదార్థ జ్ఞానమో కావచ్చు లేక ఏ విషయ జ్ఞానమో కావచ్చును, ఇంకే విధమైన పరిశోధనా జ్ఞానమో కావచ్చు. కానీ, ఆత్మజ్ఞానమనేది నిజమైన జ్ఞానం. ఆత్మ వేరు, జ్ఞానము వేరుకాదు. ఆత్మయే జ్ఞానము, జ్ఞానమే ఆత్మ. కాబట్టి ఆత్మజ్ఞానమే నిజమైన జ్ఞానము. వేదము నందు సత్యం, జ్ఞానం, అనంతం, బ్రహ్మ అన్నారు. ఈ సత్యము, జ్ఞానం, అనంతం, బ్రహ్మ—ఒక్క పరమాత్మునికి ఇవన్ని భిన్నమైన పేర్లు. ఇవి పర్యాయపదములు మాత్రమే. ఈ నాలుగు వేరువేరుకాదు.

## ఏ సాధన చెయ్యాలి ?

ఏ సాధన చెయ్యాలి? జపమా? ధ్యానమా? యోగమా? యజ్ఞమా? మరి యేమిటి? ఈ చేసే ధ్యానములన్ని మానసిక

ప్తికోసమే. మనస్సు ఉండినంత వరకు ఆ[illegible]త్త్వము అర్థము కానేరదు. నీవీ మన స్తత్త్వాన్ని మరచిపోతూరావాలి. మైండు అంటే ఏమిటి? ఇది సంకల్ప, వికల్పాత్మకమైన స్వరూపమే. ఈ సంకల్ప, వికల్పాలను త్యజించినప్పుడే ఆత్మతత్త్వము. మనం ఈ సంకల్ప వికల్పములు ఎప్పుడు త్యజించగలము? సుషుప్తి స్థితిలో త్యజించగలము. ఆ సుషుప్తినే కారణస్వరూపము అన్నారు. జాగ్రత్త దేహ స్వరూపము, స్వప్నము భ్రాంతిస్వరూపము. కారణమును, కర్తను, కర్తవ్యాన్ని మరచినప్పుడు అదే కారణ స్వరూపమైపోతుంది. విచారణ చేతనే దీనిని సాధించాలి కాని వేరే విధానములతో సాధించడానికి వీలుకాదు. ఈ మనస్తత్త్వాన్ని సరియైన దారిలో పెట్టుకోవాలి అంటే, సత్కర్మలలో ప్రవేశించాలి. సత్కర్మలు చేస్తూ ఉంటే, సద్భావాలు ఆవిర్భవిస్తాయి. అదే "యద్భావం తద్భవతి". సరియైన భావములు మనలో ఆవిర్భవించినప్పుడు, సత్యమైన తత్త్వము మనకు అర్థమవుతుంది.

## సూర్యతేజస్సు — చంద్రతేజస్సు

జ్ఞానమనగా ఏమిటి? స్వస్వరూప అనుసంధానమే నిజమైన జ్ఞానం. ఈ జ్ఞానమందు మనస్సును ఏకము చేయుటయే భక్తి. భావ రహితమైనదే జ్ఞానము. మనము ఈ సంకల్పములను క్రమ క్రమేణా అదుపులో పెట్టుకొనుటకు ప్రయత్నము చేయటమే జ్ఞానమార్గము. జ్ఞానము నందు, భక్తియందు ఒకే తేజస్సు ఆవిర్భవిస్తుంది. సూర్యుని తేజస్సే చంద్రునిలో ప్రకాశిస్తుంది. కానీ సూర్యునిలోని తేజస్సు వేడిగాను, ప్రకాశముగాను ఉంటుంది. ఇదే తేజస్సు చంద్రునిలో ప్రవేశించినప్పుడు చల్లగా హాయిగా కనిపిస్తుంది. కానీ చంద్రుని యందు, సూర్యుని యందు ఉన్నది ఒకే తేజస్సు. అయితే చంద్రుడు ఉండినప్పుడు సూర్యుడు కనిపించడు, సూర్యుడు ఉండినప్పుడు మనకు చంద్రుడు కనిపించడు. ఈ సూర్యుని యందు, చంద్రుని యందు ప్రతిబింబింపజేసే తత్త్వం ఆత్మతత్త్వము ఒక్కటే. సూర్య తేజస్సు జ్ఞానమునకు, చంద్ర తేజస్సు భక్తికిని పోల్చుకొన్నారు. జ్ఞానం ప్రకాశవంతముగానూ, భక్తి ఆనందస్వరూపముగానూ నిలుస్తూ ఉంటుంది. భక్తి, జ్ఞానములు అనేవి రెండూ ఒకే పదార్థం యొక్క ప్రారంభ అంత్యములే.

## జ్ఞాత ఒక్కడే

బాహ్య జగత్తునకు మాత్రము కర్త, కర్మ, క్రియ అనుకొంటున్నాము. ఇది భక్తి యొక్క లక్షణమే. కర్త - సాధకుడు, కర్మ- సాధన, క్రియారూపంలో సాక్షాత్కరింప జేసుకోవటమే గమ్యం. దీనిని జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అన్నారు. ఈ మూడు ఒక్కటే. మూడు స్థాయిల యందు దీనిని మూడు రూపములలో దర్శించుకొనుచున్నాము, ఉదాహరణ: (చేతి రూమాలు చూపిస్తూ) ఇది ఏమిటి? వస్త్రం. ఇది వస్త్రం కాదు. ఒక్కొక్క దానిని వేరు వేరుగా తీసినప్పుడు ఇది దారముగా ఉంటుంది. ఇది దారము కాదు. ఇది పత్తి నుండి వచ్చినది. పత్తిలేక దారము కాలేదు. దారములేక వస్త్రం కాలేదు. ఈ మూడు ఒక్కటే. కేవలం మన ఉపయోగార్థం ఈ విధమైన రూపములను అనుభవిస్తున్నాము. మూడింటి యందుండిన జ్ఞాత ఒక్కడే. మనము చేసే సాధనలన్నింటి

యందు ఎన్నియో అనుభూతులను అనుభవి స్తున్నామని భ్రమిస్తున్నాము. ఈ అనాత్మభావ మును త్యజించుటకు మనము పూనుకోవాలి.

## పార్వతి తపస్సు

లోకసంబంధమైన శక్తిసామర్థ్యముల పైన మనం ఆధారపడకూడదు. భగవంతుడు ఆత్మశుద్ధిని మాత్రమే గ్రహించునుకాని, లౌకిక మైన ప్రయత్నములకు తాను ఏమాత్రము లొంగడు. విష్ణుపురాణమునందుగాని, శివపురాణం నందుగాని పార్వతి అత్యంత లోక సౌందర్య వంతురాలనిపేరు. ఇట్టి సౌందర్యవంతురాలనని తాను భ్రమించి, తన సౌందర్యముచేత శివుని వశము చేసుకోవాలని అహంకారముతో అనేక ప్రయత్నములు చేసింది. ఎన్ని ప్రయత్న ములు చేసినప్పటికీ, అందులో తాను విఫలమై పోయింది. ఈ సత్యాన్ని గుర్తించి తన అహం కారమును తగ్గించుకొని, తన శరీరమును కొన్ని విధములైన తపస్సులచేత తపింప జేసు కుంది. ఎండకు, గాలికి ఎండి, వానకు తడిసి పోయి, చలికి వణికిపోయి అనేక రకములైన అవస్థలు అనుభవించి, తన శరీరమును శుష్కిం పజేసుకొంది. మనస్సును మాత్రం ఈశ్వరుని యందు లగ్నము చేసుకుంది. అప్పుడా మె అహంకారము నిర్మూలనమైనదని ఈశ్వరుడు గుర్తించి తన అర్ధాంగిగా తన దేహంలో అర్ధ భాగముగా నిలచిపొమ్మని చెప్పాడు. అనగా దీనియొక్క అర్థమేమిటి? ప్రకృతియే పార్వతి. ఈ ప్రకృతి అత్యంత సౌందర్యవంతమైనది. ఇట్టి అందమైన ప్రకృతి అనేక విధములైన అహంకారములకు పాల్పడి అందరిని ఆకర్షింప జేసుకుంటుంది. అందరి అభిమానం పొందుట చేత, అహంకారం మరింత అధికంగా హెచ్చి ఉంటుంది.

## సర్వమునకు కర్త ఒక్కడే

ఈ ప్రకృతియందు పుట్టిన ప్రతిమానవుడు అహంకారమయుడై జీవితమును గడుపుతూ ఉంటాడు. యౌవ్వన అహంకారము, విద్యా అహంకారము, ధన అహంకారము, సౌందర్య అహంకారం, బల అహంకారం, రాజ్య అహం కారము— ఇంకా ఇంకా అనేకమైన అహం కారములు ఉంటాయి. విద్యా అహంకారము భగవంతుని అత్యంత దూరం గావిస్తూవస్తుంది. ఇట్టి అహంకారమునకు గురైన వ్యక్తులు ఎవ్వరూ దివ్యత్వమును పొందటానికి అర్హత పొందలేరు. నిరహంకారులు మాత్రమే దివ్యత్వ మును పొందే వ్యక్తులు. వాల్మీకి, నందుడు, కుచేలుడు, విదురుడు, హనుమంతుడు, తిన్నడు, శబరి ఈ మొదలైన వారందరూ నిర హంకారులు. స్వామి భక్తిపరాయణులు. కాబట్టి మనకు ఈ భౌతిక జగత్తునందు, ఏవిధ మైన అధికారంలేదు. ఈ కనిపించేవన్నియూ అనిత్యములే. అశాశ్వతములే. మనము అనేక విధములైన అహంకారములను పెంచుకొని, అధఃపతనమైపోతున్నాము. కర్త, కర్మ, క్రియ స్వభావమును విసర్జించి, సర్వమునకు కర్త ఒక్కడే, ఈ సత్యాన్ని గుర్తించాలి. ఇచ్చేవాడు తానే, పుచ్చుకునేవాడు తానే, ఇవ్వబడే పదా ర్థము తానే. అంతా దివ్యమైన భావమే అయి నప్పుడు ఇంక రెండవ పదార్థము ఎక్కడ ఉంటుంది? "విశ్వం విష్ణుస్వరూపం" "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇట్టి ఏకాత్మ భావమును మనము అభివృద్ధి పరచుకోవాలి.

## ఇచ్చినదితానే పుచ్చుకొన్నది తానే

కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అని నాలుగు యుగములుగా మనము విభజించుకొన్నాము. ఈ నాలుగు ప్రత్యేకించినవి కాదు. మన అనుభూతుల నిమిత్తమై మనము నిర్ణయించుకొన్నవే. కలియుగమునకుకానీ, కృతయుగమునకుకానీ, ప్రత్యేకమైన స్వరూపములు లేవు. ప్రజల స్వభావములను పురస్కరించుకొనియే ఈ నాలుగు యుగములు ప్రారంభమవుతూ వచ్చాయి. కృతయుగమునందూ రాగద్వేషాలు కలిగిన వ్యక్తులున్నారు. ఈ కలియుగమునందూ శాంతస్వభావములు కలిగినవారు, నిత్య సత్య స్వభావములు కలిగినవారు ఉన్నారు. అన్ని యుగములకు భగవంతుడే ఆది. ఈ యుగములకంతా ఆది కనుకనే, ఇతనికి "యుగాది" అని పేరు. యుగాదిని ఒక పండుగగా విశ్వసించి అనుభవిస్తూ వస్తున్నాం. అన్ని భగవంతుని స్వరూపములే. భగవంతుడు కాని రెండవ పదార్థమేలేదు. ఇచ్చినది తానే, పుచ్చుకొన్నది తానే. మానవుడు ఈ సత్యాన్ని గుర్తించుకోలేక ఇచ్చినప్పుడు పొంగిపోవుచున్నాడు, పుచ్చుకొన్నప్పుడు క్రుంగిపోతున్నాడు. కనుక పొంగి కృంగనటువంటి సమతత్త్వాన్ని మనము అనుభవించాలి. మన తెలివితేటలు పురస్కరించుకొని అహంకారం మరింత అభివృద్ధి పరచుకోరాదు. మన తెలివితేటలు లౌకికమైన తెలివితేటలే. కాని ఒకరి తెలివితేటలు మరొకరి తెలివితేటల కంటే మరింత అధికముగా కనిపిస్తాయి. ఎంత అధికమైనా, ఎంత అల్పమైనా కేవలం హెచ్చుతగ్గులు మాత్రమే కనిపిస్తున్నాయి కానీ, అన్నింటి స్వభావము ఒక్కటే. అందుచేతనే, ఈ జగత్తును "అనిత్యం అసుఖం లోకం" అన్నారు.

## 'తెలుపు - నలుపుల' తారతమ్యం

ఒక రాజు తన రాజ్యంలో ఎవరు మేధాశక్తి కలిగినవారో పరీక్షించాలని సభలు జరిపి, అందరిని ఒక చోటచేర్చి, వారిని ఒక ప్రశ్న వేశాడు- ఈ ప్రపంచములో అన్నింటి కంటే తెలుపైనది, నలుపైనది ఏది? ఒక్కొక్క మేధావి ఒక్కొక్కరీతిగా చెప్పుతూ వచ్చాడు. ఒకరు పాలన్నారు. మరొకరు ప్రత్తి అన్నారు. ఇంకొకరు ఆకాశము అన్నారు. అందరిలో మరొకడు పక్షి అన్నాడు. ఏవేవో వారివారికి తోచినట్లుచెప్పుతూ వచ్చారు. కానీ, ఇవన్నియూ లోకసంబంధమైన వస్తువులే.

ఆ సభలో ఒక పరమభక్తుడు ఉండటం జరిగింది. ఈ రీతిగా సమాధానం చెప్పాడు—

"రాజా! నేను తెలివితేటలు కలిగినవాడనుకాను. నాకేమైనా ఇంతో-అంతో తెలివి ఉంటే అదికూడా భగవంతుడు అనుగ్రహించిన వరమే. అది నాదికాదు. అందరి తలలలో తెలివిని చేర్చినటువంటివాడు భగవంతుడే. కానీ, ఆ తెలివిని దుర్వినియోగపరచుకొనేవారు కొంతమంది. సద్వినియోగపరచుకొనేవారు కొంతమంది అని చెబుతూ, మహారాజా! అన్నింటికంటే తెలుపైనది పగలు (Day), అన్నింటికంటే నలుపైనది రాత్రి (Night) అని చెప్పినాడు. ఈ జగత్తులో ఉండేటటువంటిది ఇదే- తెలుపుపగలు, నలుపు రాత్రి. ఈతెలుపు నలుపులలోనే మన జీవితం అంతం గావించుకొంటున్నాం. తెలుపుపోతూనే నలుపు, నలుపు

పోతూనే తెలుపు వస్తాయి. ఈ తెలుపు నలుపులను సాధించినవారు ఏవరు ్నరీలోకములో? అతనే భగవంతుడు. తెలుపు నలుపులతో కూడిన దానిని "దినము" అని అన్నారు. ఈ తెలుపు నలుపులను సాధించినవానిని "దైవము" అని అన్నారు. దినమునకు దైవమునకు ఉన్న వ్యత్యాసము ఒక్కటే. దైవమునకు Day and Night లేదు. అనగా రాత్రింబవళ్ళులేవు. దినమునకు Day and Night ఉంటున్నవి. ఈ రాత్రి పగలు సాధించుటలో ఉండే వివేకము, విజ్ఞత భగవంతుని అనుగ్రహమే" అన్నాడు.

ఏ తెలివితేటలు లేనివాడు, ఏ ఇతిహాస పురాణములు, శాస్త్రములు చదువని ఈ మూర్ఖుడు చెప్పినది ఏవిధంగా రైటు అవుతుంది? అని పండితులు అహంకారముతో, ఆవేశంతో తమ బాధను వ్యక్తంచేసినారు. వెంటనే వీరందరూ రాజు దగ్గర ఈ రీతిగ Complaint చేసినారు— "రాజా! ఈ అజ్ఞాని, మూర్ఖుడు చెప్పినది మీరు విశ్వసించకూడదు. దీనికొక ప్రమాణము, ఒక నిదర్శనము నిరూపించాలని" పల్కినారు. ఈనాడు నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, భౌతిక, వైజ్ఞానిక— అన్ని రంగముల యందు పరిశోధనలు చాలా ప్రధానమన్నారు. ఈ పరిశోధనలు అన్నీ, ప్రాకృత సంబంధమైనవే. కనుక దీనిని పరిశోధన చేసి ఇది సత్యమా? అసత్యమా? నిర్ణయించాలని పండితులు చాలా పట్టుపట్టినారు. పండితుల మాటలను రాజు అనుసరిస్తూ వచ్చాడు, "నాయనా! పరమ భక్తుడా! దీనికి ఏమిటి ప్రమాణము? ఏరీతిగా దీనిని సత్యమని చెప్పగలవు?" అని ప్రశ్నించాడు. "మహారాజా! నాకు ఒక్క దినము కాలము ఇవ్వండి" అని అన్నాడు. రాజు 'సరే! తీసుకో'మన్నాడు. రెండవది అడిగాడు భక్తుడు- "ఆ దినములో నేను ఎటుపోయినా, ఏమిచేసినా, ఎవరూ ఏమీ అడ్డు చెప్పకూడదు. ఇదే నా పరిశోధనల యొక్క ఇష్టమని" తెలిపినాడు. అతని ఇష్టమును రాజుగారు అంగీకరించి, ఆరాజ భవనమునకు ఫలానా వ్యక్తి వచ్చినప్పుడు ఎవ్వరూ అడ్డుచెప్ప కూడదు, అతను ఏమిచేసినా ఎవ్వరూ అతనికి అడ్డు చేయకూడదని అందరికీ చెప్పాడు.

రెండవ దినం మహారాజు మధ్యాహ్నం భోజనంచేసి పడకగదిలో విశ్రాంతి తీసుకొంటున్నాడు. అదే సమయమందు ఈ వ్యక్తి ఒక పాత్రలో పాలుపోసుకొన్నాడు. వెంటనే బయలుదేరి ఆ మహారాజు పడకగదిలోపల ఆ పాల గిన్నెనుపెట్టి, పడకగదికి ముందు భాగమున ఒక చంటిబిడ్డను తెచ్చి, కొట్టికొట్టి ఏడిపించుటకు ప్రారంభించినాడు. ఆ చంటిబిడ్డ రోదన వల్ల ఆ మహారాజునకు నిద్రాభంగము కలిగినది. రాజు పట్టరానికోపంతో ముందు వెనుకలు గమనించకుండా పరిగెత్తుకొని వస్తున్నాడు. 'ఇంత అల్లరిచేసేవారెవరు?' అంటూ ఆ వచ్చే సమయంలో ఆ పాలగిన్నెను కాలితో తన్నాడు. ఆ సమయమున అతనికి ఆ పాలగిన్ని కనిపించ లేదు పాపం. "రాజా! పగటి కంటే పాలు చాలాతక్కువ తెలుపు కలిగినవి కనుక, పాల యొక్క తెలుపు నీకు కనిపించలేదు. ఈ పాలు ఎక్కువ తెలుపైనవే అయితే, మీకు ఎందుకు కనిపించలేదు? పగటి తెలుపు కంటే ఈ పాల తెలుపు తక్కువైనది. పాలకంటే పగలు చాలా తెలుపైనది. కాబట్టి, ఈ విషయానికి మీరు ఒప్పుకొనక తప్పదు" అన్నాడు భక్తుడు.

ఆకాశములో నక్షత్రాలు పగలు కూడా ఉంటాయి. పగటి వెలుతురు చాలా ప్రకాశంగా ఉండుటచేత నక్షత్రాలు కనిపించుట లేదు. పగలుదాటి రాత్రి అయ్యేటప్పటికి నక్షత్రాలు కనిపిస్తున్నాయి. అందుచే పగటివెలుపు కంటే, తెలుపైనది జగత్తులో మరొకటిలేదు. ఈ పగటి తెలుపే జ్ఞానము. రాత్రి నలుపే అజ్ఞానము. ఈ జ్ఞానాజ్ఞానములకు రెండింటికీ అతీతమైనదే దివ్యత్వం, అదే దైవత్వం. అట్టి దైవత్వమును విస్మరించి, ఈ లౌకికమైన వస్తు వాహనాదుల పైన వక్రమార్గము చేత కాలాన్ని దుర్వినియోగంచేసి అనుభవిస్తున్నాము. దివ్యత్వాన్ని పొందాలంటే, దివ్యతత్త్వంతోనే దివ్యత్వము పొందాలి.

## చెప్పేదొకటి - చేసేదొకటి

ఈనాటి మానవుడు నేను ఆత్మస్వరూపుడనని చెప్పుతూ ఉంటాడు. కానీ, దేహ సంబంధమైన పనులు చేస్తున్నాడు. చెప్పేది ఒకటి చేసేది మరొకటి. ఇది సత్యమని ఎట్లా చెప్పగలరు? The proper study of mankind is man అదే Thought, word and deed. మనో, వాక్కాయ కర్మ లంటే ఇవే. ఈ మూడింటి ఏకత్వం కావాలి. అట్టి ఏకత్వమును పొందాలనుకొంటే, ఆత్మతత్త్వమును అర్థంచేసికోవాలి. ఆ ఆత్మయే కాలము. కాలము భగవంతుడు. కనుక కాలమును సార్థకం గావించుకొనే కర్మలను చేయాలి. ఇంతకు మించిన మంచి సాధన మరొకటిలేదు. కాలమును సత్ప్రవర్తనచే,సదాలోచనచే, సత్కర్మలచే మనము సార్థకము గావించుకోవాలి.

" సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" కాబట్టి, దీనికి సత్సంగం అత్యవసరము. ఈ సత్సంగమే లేకపోతే, ఉత్తమమైన భావాలు మనలో ఆవిర్భవించవు. ఎటువంటి సమాజంలోచేరితే, అటువంటి స్వభావాలే మనము పొందుతాము. ఈ సందర్భమునకు అనుగుణ్యంగా ఐన్‌స్టీన్ 'Tell me your company, I shall tell what you are.' అని చెప్పినాడు. నీవు ఎటువంటి సంఘములో చేరుతావో, అటువంటి వాడవని నిర్ణయం చేయవచ్చును, చేసికోవచ్చును. మంచివారితో చేరు. భగవద్భక్తిని, భగవద్భావాన్ని నీలో నింపుకో. దివ్యమైన, భవ్యమైన సంబంధము పెంచుకో. ఇదే నిజమైన సాధన.

## ఆత్మసాక్షాత్కారం

జ్ఞానమంటే ఏమిటి? తన తత్త్వమును తాను తెలుసుకోవటమే. అదే నిజమైన జ్ఞానం. స్వస్వరూప అనుసంధానమే జ్ఞానము. నిరంతరము ఆ స్వరూపమును చింతించడమే సాక్షాత్కారము. సాక్షాత్కారమంటే సాక్షాత్ ఆకారమే సాక్షాత్కారం. Self అంటే ఏమిటి ? ఆత్మ. Self-realisation కావాలి, I అదే Self. 'I' అనేదెవరు ? దేహమా I, మనస్సా I, బుద్ధా I, ఆత్మనా I ?—ఈ అన్నింటియందు విచారణ చేస్తే, ఆత్మయే I. కనుక ప్రపంచములోపల లౌకికమైన I ఒకటి, ఆధ్యాత్మికమైన I ఒకటి రెండు I లు ఉన్నాయి. ఈ ప్రాకృతమైన I ఏమిటంటే EYE ఇది మూడు అక్షరాలుకలది. అధ్యాత్మిక I one letter I. EYE అనేది దేహ సంబంధమైనది. ఏకాక్షరం I అదే ఆత్మ.

--్మను గుర్తించుకోవటమే, నేను అనుకోవటమే నిజమైన I. అదే ఆత్మసాక్షాత్కారము.

## నరుడు - నారాయణుడు

ఈ ఆత్మ అనేది ఎక్కడ నుండి వచ్చినది? నరుడు అనగా ఆత్మయే. ఈ ఆత్మనుండే ఆకాశాది భూతములంతా ఆవిర్భవించాయి. ఆకాశాది భూతములను నారములని పిలుస్తూ వచ్చారు. ఈ నారములకు నిలయుడైనవాడే నారాయణుడు. పంచభూతములతో కూడిన నరుడే నారాయణుడు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులన్నీ ప్రతి మానవుని యందును ఉంటున్నాయి. నరుడనగా ఆత్మ అనే అర్థం. ఆత్మ అనగా ఆనందమయమైనది. ఇట్టి శాశ్వతమైన ఆనందము ఈ జగత్తు నందు మనకు కానరాదు. మనం అనుభవించేది తాత్కాలికమైన, క్షణభంగురమైన ఆనందమే. ఇంద్రియములచేతను, వస్తువులచేతను, విషయముల చేతను, వ్యక్తులచేతను అనుభవించే ఆనందం. వ్యక్తులే అశాశ్వతము. విషయములే అశాశ్వతము. పదార్థములే అశాశ్వతము. అశాశ్వతమైన వస్తువుల నుండి శాశ్వతమైన ఆనందము మనం యేరీతిగా పొందగలము? కనుక సత్యమైన తత్త్వం నీ యందే ఉన్నది. అట్టి సత్య తత్త్వాన్ని పొందటము కోసమే, సాధన అత్యావసరము.

## బింబము - ప్రతిబింబము

ప్రతిబింబాలు మారుతున్నాయికాని, బింబాలు ఏనాటికీ మారవు. కదిలే జలములోపల సూర్యుడు కదిలినట్లుగా కనిపిస్తాడు, స్థిరమైన జలములోపల స్థిరమైన సూర్యుడు కనిపిస్తాడు. మాలిన్యమైన జలములోపల న్యమైన సూర్యుడుగా కనిపిస్తాడు. ఈ కనిపించే మాలిన్యం సూర్యునిది కాదు. కదిలే సూర్యుడు సాక్షాత్తు ఆ సూర్యుడు కాదు. ఇవన్నీ ప్రతిబింబములు మాత్రమే. ఈ దేహమే ఒక పాత్ర, ఈ మనస్సే ఇందులోని ద్రవపదార్థం, దీనిలో కనిపించే ఆత్మ తత్త్వమే ప్రతిబింబము. మనస్సు స్వభావమును పురస్కరించుకొని స్థిరముగను, అస్థిరముగను లేక మాలిన్యముగను, రూపొందుతుంది. సరియైన భావములు మనలో ఆవిర్భవించినప్పుడు సత్యమైన తత్త్వము మనకు అర్థమవుతుంది. చాలామందికి ఆధ్యాత్మిక విషయాలు అంతగా అర్థము కావు. పైమూడింటి యందు ఉండిన ఏకత్వమును గుర్తించుటకు ప్రయత్నించాలి.

## అచరం - చరం

"అచరం చరమేవచ" కదలకుండా ఉండేవాడు, కదిలేవాడు భగవంతుడే. కదిలించేవాడు భగవంతుడే. కదిలేవాడు తానైనప్పుడు అచలుడని ఎట్లా చెప్పుతారు? స్థిరమైనవాడంటే, చరమైనవాడని ఎట్లా చెప్పుతారు? ఈ రెండింటికి చాలా విరుద్ధము. స్థిరమైనవాడు భగవంతుడు కానీ, కదలుచున్నాడు. దీనికి వేదాంతము చక్కని ఆదర్శమును అందిస్తూ వచ్చింది. మన స్వప్నావస్థ యందు మన స్వరూపము అనేక రకములుగా కదలుతూ ఉంటుంది. పనులు చేస్తూ ఉంటుంది. ఎన్నో విధములుగా చలిస్తూ ఉంటుంది. నడుస్తున్న దేహము ప్రక్కపైన స్థిరముగా ఉంటుంది. ఇక్కడ స్థిరం, అక్కడ చరం, చరం స్థిరమేవచ- రెండూ ఒక్కటే. ఒక అవస్థలో

చలిస్తూ ఉంటున్నది. మరొక అవస్థ లోపల స్థిరంగా ఉంటుంది. అదే విధముగా వేదాంత మునందు శారీరక దృష్టిలోపల చలించటం, బ్రహ్మ భావములో స్థిరంగా ఉండటం. ధ్యానము అనేది ఏమి? బ్రహ్మ భావంచేత స్థిర మైన తత్త్వమును పొందటమే ధ్యానము యొక్క అంతరార్థము. ఇట్టి వేదాంత వాక్యులు ఎన్ని విధములైన అంతరార్థములనే ప్రబో ధిస్తూ ఉంటాయి.

## నీవు అమృత పుత్రుడవు

"వాసః" అనగా నీ నిః మెక్కడ? అని అర్థం. అయ్యా! నీ నివాసమెక్కడ? అంటే "South Prashanthi లోపల, ఫలానా రూంలో ఉన్నాను" అని ఈ విధంగా నీ నివాసమును గూర్చి సమాధానము చెప్పుకోవడం కాదు. కాని ఈనాడు, "వాసః"-అంటే జగత్ సంబంధమైన వాసంగా భావిస్తున్నారు. "సర్వజీవుల వాసము భగవంతుని యందే- నేను భగవంతుని యందు వాసము చేస్తున్నాను". 'అయ్యా! నీవెవ్వరు?' అంటే నేనొక రెడ్డిని, రాజునని చెప్పుట సహజం కానీ, ఇవి దేహ సంబంధమైనవి మాత్రమే కానీ, ఆత్మకు సంబంధమైనవి మాత్రము కాదు. ఇవన్నీ లౌకికజగత్తునందు ఉపయోగపెట్టుకునే తత్త్వములు. నీవు రెడ్డివి కాదు, నీవు రాజువూ కాదు. నీవు ఆత్మ స్వరూపుడవు. కాబట్టి నీవు అమృత పుత్రుడవని వేదం చెప్పింది.

## నీ హృదయాంతరాళానికి పయనించు

మన దేహములో ఉండిన రక్తం సరఫరా కావటానికి మనమేమి సాధనలు చేస్తున్నాము? మన ఉచ్ఛ్వాస, నిశ్వాసములు కూర్చున్నా, నడుస్తున్నా, నిద్రపోతున్నా, అవి సహజంగా జరిగిపోతూనేయున్నాయి. ప్రయత్నంతో లభిం చేటటువంటివి కాదే! కాబట్టి దైవ చింతలు అప్రయత్నముగా సహజముగా రావాలి. "సహజం"- అనగా ప్రయత్నం కానిదానితో జరిగేది. అభ్యాసము (Practice) వల్ల అప్ర యత్నంగా జరిగిపోతూనే ఉంటాయి. అలాం టిది కాదు. బుద్ధిపూర్వకంగా జరగాలి. కొంత మంది "నస్యం" వేసుకుంటారు. వారికి అప్ర యత్నంగా, ఆ చెయ్యి అక్కడకు పోతూనే ఉంటుంది. కొంతమంది ఊరికే జపం చేస్తూ చేస్తూనే ఉంటారు. ఇది Unconcience లో జరు గుతుంది. ఇది నిజమైన జపము కాదు. బుద్ధి పూర్వకంగా సరియైన రీతిలో జరగాలి. ఇది Unconcience ఉండకూడదు. Superconcience లో జరగాలి. అప్పుడే ఇది సహజమైనది. అయితే మనం ఆ స్టేజికి రాగలమా? అని యోచించనక్కరలేదు. నిజంగా అపట్టుదల పట్టితే మీరు తప్పక సాధించవచ్చు. తప్పక. ఎట్టి సందేహములేదు. మనము సరియైన పట్టు పట్టుటలేదు. లౌకిక విషయాలకై పట్టుపడు తున్నాము. లక్షల మైళ్ళ "అంతరిక్ష" యానము చేయాలంటే, కావలసినంత సాధన చేస్తున్నాము. కానీ ఒక యించైనా "హృదయాం తరాళానికి" ప్రయాణం చేయుటలేదు. ఇది నిజమైన, సరియైన సాధన. ఎన్ని సంపాదిం చినా, ఎంత తెలివితేటలు కలిగినా, ఎంత చదివినా - యేమి ప్రయోజనం లేదు. ఇవన్నీ లోకానికి సంబంధించినవే. ఇవన్నీ లోకంలో సుఖశాంతులు మాత్రమే అందించగలవు. కానీ ఆత్మశాంతిని అందించ లేవు.

## భగవత్‌చింతన చేయండి

ఆత్మశాంతి ఒక దైవం చేతనే మనకు లభ్యమవుతుంది. ఈనాడు నూతన సంవత్సర మనుకుంటే, సంవత్సరమనేది నూతనకాలం. ఇది కేవలం దైవస్వరూపమే. "సంవత్సరం" అనగా దైవం అని అర్థం. కనుకనే—

"కాలాయనమః కాలకాలాయనమః కాల
దర్పదమనాయనమః కాలాతీతాయనమః
కాలనిర్మాతాయనమః" అని వేదవాక్యం.

కాబట్టి అంతాకాలమే ముఖ్యకారణం. మీరు కాలాన్ని పవిత్రం చేసుకొనే కర్మలు ఆచరించండి. ఎవ్వరినీ, సాధ్యమైనంతవరకు బాధించకుండా చూచుకోండి. ఏమిచేసినా, ఏదిచేసినా ఆ ఫలితం మనమే అనుభవిస్తాం. ఏ కోపమో, తాపమో, ఈర్ష్యనో, అసూయనో, డంబమో— వచ్చినప్పుడు భగవత్ చింతన చేయండి.

—శ్రీవారి దివ్యబోధ
ప్రశాంతిమందిరం,
ప్రశాంతినిలయం, 1-1-1991.

---

### శ్రీ సత్యసాయి హైయ్యర్ సెకండరీస్కూల్, విద్యాగిరి, ప్రశాంతినిలయం,
### అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్ (పిన్‌కోడ్ — 515 134)

1వ తరగతికి (బాల బాలికలకు) మరియు 11వ తరగతికి (బాలురకు మాత్రమే) ప్రవేశాలు 1991 జూన్ నెలలో జరుగును. ఈ పాఠశాల సెకండరీ ఎడ్యుకేషన్, సెంట్రల్‌బోర్డు, న్యూఢిల్లీవారి అనుబంధిత పాఠశాల. ఇది ఇంగ్లీషు మీడియం — పూర్తిగా రెసిడెన్షియల్ పాఠశాల.

ప్రాస్పెక్టసు, అడ్మిషన్ ఫారములు రూ॥ 20 మాత్రమే మనియార్డర్ ద్వారా పంపించి ప్రిన్సిపాల్‌గారి నుండి పొందవచ్చును. ప్రిన్సిపాల్‌గారి ఆఫీసు నుండి ఫారములు జారీ చెయ్యడానికి ఆఖరు తేదీ 15-3-'91

ఇంగ్లీషు మీడియం తరగతుల నుండి వచ్చే విద్యార్థులు మాత్రమే ప్రవేశానికి దరఖాస్తులు పంపుకోవాలి.

ప్రిన్సిపాల్.

---

## చందాదారులకు విజ్ఞప్తి

సనాతన సారథి (ఇంగ్లీషు లేదా తెలుగు) పొందగోరు చందాదారులు రెన్యువల్ కోరునప్పుడు, కవరుపై సూచించిననెలకు రెండు మాసములు ముందుగా తమ చందాలు పంపుతూ, అడ్రసులో (చిరునామాలో) మార్పులేవైనా ఉంటే తెలుపగోరుచున్నాము.

కన్వీనర్, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు,
ప్రశాంతినిలయం పోస్టు, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా, పిన్ 515134 కు
మీ అభ్యర్థనలు చిరునామాకవరుతోసహా పంపగోరుచున్నాము.

# భౌతికవిద్యలు - ఆధ్యాత్మికవిద్య

"విద్యనేర్చిన వాడనని విఱ్ఱవీగవద్దు. భాగ్యవంతుడనని పలుకవద్దు. ధనవంతుడనని తరచు గర్వించవద్దు. పుత్రవంతుడనని పొగడుకోవద్దు. నేను దాతనటంచు చెప్పుకోవద్దు. స్వామిభృత్యుడనంచు పొంగవద్దు. శౌర్యవంతుడనని సంతోషపడవద్దు. కార్యశూరుడనంచు భావింపవద్దు. ప్రపంచంలో నీవు నలుగురికి మెప్పుగా నడచుకొన్నచో, ఆ నళినదళనేత్రుడు నిన్ను ఆకర్షించి, దీవింపగలడు."

ప్రేమస్వరూపులైన విద్యార్థినీ, విద్యార్థులారా! అధ్యాపకులారా!

"భగవంతుడు అంతటా అనేకమైన పాదములతో, హస్తములతో, ముఖములతో, శిరస్సులతో, కన్నులతో, చెవులతో — వ్యాపించి ఉన్నాడు". ఈ సత్యాన్ని మానవుడు గుర్తించుకోలేక తానేమేమో చేయుచున్నానని, ఏమేమో తలంచుచున్నానని, ఇది ఎవ్వరికీ తెలియదని భ్రమించుచున్నాడు. భగవంతుణ్ణి కనుమరుగు చేయటానికి ఎవ్వరికి సాధ్యంకాదు. అతడు అన్నింటినీ గుర్తిస్తున్నాడు. సర్వ భూతముల యందు లోపల వెలుపల వ్యాపించియున్న భగవంతుని మరుగు పరచుటకు వీలులేదు. జీవులు వేరు వేరుగా ఉండినప్పటికీ దైవము తాను ఒక్కడుగనే ఉన్నాడు. తనను తాను ఏనాడు విభజించుకోలేదు. జగత్తులో దైవమునకంటే మనకు అతి సన్నిహితుడైనవాడు మరొకరులేరు. తల్లిదండ్రులకంటే అతి సన్నిహితుడు, ఆప్తుడు దైవము తప్ప మరొకరు వేరులేరు. అట్టిదైవమును మరచిన పాపము వచ్చును.

## అవిశ్వాస అహంకార మేఘాలు

అజ్ఞానియైన మానవుడు "భగవంతుడు సర్వవ్యాపి, సర్వ శక్తిమయుడు, సర్వజ్ఞుడు" అయినచో మాకెందుకు గోచరించడు? అని ప్రశ్నిస్తూ ఉంటాడు. ప్రకాశించే సూర్యునకు తన కిరణములద్వారా ఏర్పడిన మేఘములు అడ్డు తగిలి సూర్యుని కనిపించకుండా చేస్తాయి. కానీ అంతమాత్రముచేత, సూర్యుడు లేడని భావించటానికి వీలులేదు కదా! అటులనే మానవుని యందు ఆవిర్భవించిన అవిశ్వాస, అహంకారములనే మేఘములు భగవంతునకు అడ్డుతగులుటచేత భగవంతుడు గోచరించడు. మన అవిశ్వాసము, అహంకారములే అతనిని కనిపించకుండ చేయుచున్నవి. ఝంఝూమారుతము వీచినంతనే మేఘములు కదలి, సూర్యుడు ఏ విధముగా మనకు గోచరించునో, అటులనే

ప్రేమ, విశ్వాసములనే గాలి సోకినచో - అహంకార, అవిశ్వాసాలనే మేఘాలు తొలగిన దైవం కనిపించును. ఇట్టి అవిశ్వాస, అహంకార మేఘములు దూరము గావించుకొనే నిమిత్తమై కొన్ని విధములైన సాధనలు మనము సల్పాలి.

## ఆధ్యాత్మిక మిత్రుడు

లౌకికమైన మిత్రులు ఎంతమంది ఉండి నప్పటికీ ఆధ్యాత్మిక మిత్రుడనేవాడు లేకపోతే ఈ మిత్రులందరూ నిరుపయోగమే. ఆధ్యాత్మిక మిత్రుడు భగవంతుడు ఒక్కడు ఉండెనా, లోకమంతా నీకు మిత్రత్వమే. దైవమనే మిత్రుణ్ణి నీవు దూరముగా చేసుకొంటే, జగత్తంతా శత్రుత్వంగా మారిపోతుంది. కనుక దైవమనే మిత్రత్వమును మీరు సంపాదించు కొనుటకు తగిన పోరాటం చెయ్యండి. ఆ పోరాటము నకు విశ్వాస ప్రేమలే ప్రధానమైన సూత్రములు. క్రిందా, మీదా, చుట్టూ అగ్ని మండుతూ ఉండినప్పటి కిని, దానిని తప్పించుకొని, ఏ విధముగా మోటారు సైకిలుపై లోపల దూరినారో, అదే విధముగనే, బాహ్యమైన, ప్రాపంచికమైన ఎన్ని చిక్కులుండినప్ప టికి, వానిని తప్పించుకొని దైవత్వము అనే దానిలో ప్రవేశించినప్పుడే మన లక్ష్యమును సాధించినవారమ వుతాము. ఇందువలన మీరు ఆనందించడమే కాకుండా ప్రజలను, తల్లిదండ్రులను, ప్రేక్షకులను కూడా ఆనందపరచిన వారవుతారు. మీరూ ఆనందమును అనుభవించవచ్చును.

## దివ్యమైన మిత్రుడు భగవంతుడే

భగవంతుని మించిన మిత్రుడు ఇంకొకడు లేడు. దూషణ, భూషణ తిరస్కారములకు ఏమాత్రము తాను చిక్కనటువంటివాడు కాదు. తాను ప్రతిఫలాపేక్షతో మానవుని త్యజించుట లేదు. "సుహృత్" అని భగవంతునికి ఒక పెద్ద టైటిల్ (బిరుదము). అనగా పరమ మిత్రుడు భగవంతుడు. భక్తుని నుండి ఎట్టి ఫలితమునూ తాను ఆశించడు. ప్రతిఫలాపేక్ష లేక వ్యక్తులను ఆదరించే మిత్రుడు భగవంతుడు ఒక్కడే. అట్టి మిత్రుని విశ్వసించటానికి మానవుడు ఏమాత్రం అంగీకరించుటలేదు. ఏ మానవుడు అట్టి మిత్రుని అంగీకరించి దరిచేరి అతని బోధనలను ఆచరించునో, అనుష్ఠించునో, అట్టివానికే ఆ దివ్యమైన మిత్రత్వము అర్థమవుతుంది. అట్టి విశ్వాసమే నిజమైన జ్ఞానము. ఇహలోకంలో సంపాదించుకొనే విద్య, పరలోకంలో ముక్తిని సంపాదించుకొనే "బ్రహ్మవిద్య" ఈ రెండింటియందు ఉత్తీర్ణుడైనవాడే నిజమైన మానవుడు. బయట మిత్రత్వమునకు నీవు ఎంత పాకులాడుతు న్నావో, ఆధ్యాత్మిక మిత్రత్వమైన దైవత్వమునకు నీవు అంతకంటే అధికముగా కృషి చేయాలి. అట్టి మిత్రుని నీవు సాధించినప్పుడే "సుహృత్" అనే తత్త్వం నీలో అభివృద్ధి అవుతుంది.

## జ్ఞాన ఫలం

జ్ఞానం, జ్ఞేయం, జ్ఞాన గమ్యం అంటారు. దీనినే వేదాంత పరిభాషయందు వేరు వేరు పేర్లతో బోధిస్తూ వచ్చింది. ఇందులో ప్రధానమైనది ఆసక్తి కావాలి. రెండవది సాధనలు సల్పాలి. తదుపరి ఆరూఢుడు దాని ఫలితమును పొందిన వాడవుతాడు. మనము దీనిని విద్యార్థి స్థితి యందే తీసుకొనవలెనన్న (విద్యార్థి - అధికారి - పెన్షనర్) విద్యార్థి దశయందు విద్యను శ్రద్ధతో అభ్యసించి తద్వారా విద్యయందున్న రహస్యమును గుర్తించుకోవాలి. ఇట్టి దానిని అధికార స్థానమునందు అనుభూతితో అందించాలి. అదియే ఉద్యోగ లక్షణము. కర్తవ్యమును నిర్వర్తించటము, క్రమము తప్పక ఆచరించటము, స్వార్థరహితమైన పనులలో ప్రవేశించటము, క్రమశిక్షణతో తానీ ఉద్యో గము చేసినప్పుడే, ఉద్యోగము విరమించుకొన్న తరు వాత పెన్షన్ పొంది సుఖశాంతులను అనుభవించ గలడు. అదే విధముగనే ఆధ్యాత్మిక మార్గమందు ఆసక్తిని పొందటమే విద్యార్థి స్థాయి. దీనిని పొందే నిమిత్తమై తగిన కృషి చెయ్యాలి. గుర్తించిన సత్య

సాధనలను ఆచరణలో పెట్టాలి. అప్పుడే మనకు "జ్ఞానఫలం" అనే దివ్యత్వము ప్రాప్తిస్తుంది. జ్ఞానమే భక్తి, జ్ఞేయమే ఇక్కడ ఉద్యోగము, జ్ఞానఫలమే పెన్షన్. జ్ఞానమనే విద్యను మనము అభ్యసించాలి. అభ్యసించిన ఈ జ్ఞానాన్ని అనుభూతిలో ఉంచాలి. అదే జ్ఞేయము. ఈ రెండింటి యందు ఉత్తీర్ణం డైనప్పుడే జ్ఞానఫలమనే దివ్యత్వము మనకు అర్థమవుతుంది. అదే సత్ చిత్ ఆనందమనే పెన్షన్ మనం పొందవచ్చును.

## వాదములు - మూడు విధములు

"వాదః ప్రమాదితః". వాదం అనేది మూడు విధాలుగా ఉంటున్నది. ఒకటవది వాదము, రెండవది గర్వం, మూడవది వివాదము. ఈ మూడింటి యందు సరియైన సత్యాన్ని గుర్తించుకొన్న వ్యక్తికి ఎట్టి సందేహములు కలుగవు. వాదమనేది సత్యాన్ని తెలుసుకొనే నిమిత్తమై, తత్త్వమును అర్థము గావించుకొనే నిమిత్తమై, రాగ ద్వేష రహితమైన మాటలతో తాను వాదోపవాదములు చేస్తూఉంటాడు. ఇది కేవలం అపేక్ష సహితమైన ఆనందముతో చేసే వాదన. సంకుచితమైన భావములు కాని లేక సందేహ భావములు కాని లేకుండ, తమ విశ్వాసమును అభివృద్ధి పరచుకొనే నిమిత్తమై వాదన చేస్తూ ఉంటారు. ఇది సహజవాదన. రెండవది గర్వవాదన. తన మాట మాత్రమే తాను నెగ్గించుకొనవలెనని, పరుల యొక్క మాటలు ఖండించవలెనని- సంకుచితమైన భావంతో, రాగ, ద్వేషములతో వాదించేటటువంటిది. పరులను ఓడించడమే తన ప్రధాన లక్ష్యముగా భావిస్తాడు. తన తత్త్వము సత్యమా ? అసత్యమా ? అనే విచారణ ఏమాత్రం చెయ్యడు. ఇంక మూడవది. నిరంతరము పరులను దూషించడము, పరులు చెప్పినదానిని ఖండించడము, సత్యమా? అసత్యమా ? అనే విచక్షణా జ్ఞానము లేకుండగా ఉంటాడు. దీనిని వితండ వాదమంటారు. ఇట్టి మానవులు ఈ జగత్తునందు అనాది కాలం నుండి- కాలంతోపాటు కర్మలను, కర్మలతోబాటు కాయమును అనుభవిస్తున్నారు.

## నాలుగు తత్త్వాలు

మనం విజయాన్ని చేకూర్చుకొనవలెనన్న నాలుగు తత్త్వములు మనము అర్థం చేసుకోవాలి. "యాస్తిక, ఆస్తిక, ఆస్తిక-నాస్తిక, నాస్తిక" — అని నాలుగు విధములు కలవు. 1. "యాస్తిక"- అనగా పవిత్రమైన భగవత్ వీచికలు సుగంధముతో మనకు ఆనందమును అందించుచున్నప్పుడు, ఈ సుగంధము ఎక్కడ నుండి వచ్చుచున్నది? అన్న విచారణ సల్పి, ఆ సుగంధము ఏ జన్మస్థానము నుండి మనకు వెలువడుచున్నది- అనే విచారణ చేయటము. వెతికి వెతికి ఆ సుగంధము ఏ పుష్పము నుండి వచ్చుచున్నదో, ఆ పుష్పాన్ని పట్టడం. అనగా వేద శాస్త్ర ఇతిహాస పురాణముల యొక్క తత్త్వమును, ఈ పొదలనూ చక్కగా విచారణ చేసి, ప్రతీ పొదయందు, ఈ సుగంధ పుష్పము ఎక్కడ ఉన్నది? అని ఏక లక్ష్యముతో వెతకడమే. ఈ వెతికినప్పుడు చిక్కినదే యాస్తికత్వము. అనగా వెతికి ఆ సత్యాన్ని గుర్తించి దానిని పొందడమే యాస్తికత్వము.

2. "ఆస్తికత్వము" అనగా వాసన గుర్తించి ఇది ఎక్కడ ఉన్నది? ఎక్కడ ఉన్నది? అని జీవితమంతా వెదకుతూ ఉండటమే ఆస్తికత్వము.

3. "ఆస్తిక - నాస్తికత్వము" అనగా కొంత కాలము ఈ వాసనను చూచి ఎక్కడ ఉన్నది? అని వెతికి నిరాశతో, నిస్పృహతో ఈ విచారణ వదలుకోవడము. అట్టివానికి వాసనకూడ తెలియదు. వాసన లేక పోలేదు. వాసన ఉన్నదికాని, అతనికి అవరించిన రోగము యొక్క ప్రతిఫలమే. ఈనాటి విద్యార్థి స్థితి కేవలము వాసన అనుభవిస్తున్నాడు. కొంతమంది దానిని వెదకడానికి ప్రయత్నము చేస్తున్నారు. కొంతమంది వాసన ఉన్నది, మాకంతే చాలు; పుష్పాన్ని వెదకనక్కర లేదని విరమించుకొంటున్నారు. ఇది ఆస్తిక—నాస్తికత్వము.

4. "నాస్తికత్వము" అనగా మరికొంతమంది ఈ లౌకికము, భౌతికమే మనకు ప్రధానముకాని, ఈ విధమైన ఆస్తికత్వమనే సుగంధము మాకు అక్కరనే లేదని భావిస్తున్నారు. ఇట్టివారే నాస్తికులు. కేవలము ఈలాంటి వారు జీవితమంటే ఏమిటో గుర్తించుకో లేకపోవుచున్నారు. తినటం, త్రాగటం, ధనం వృద్ధి చేసుకోవడం, సుఖమును అనుభవించడం — ఇదే జీవిత లక్ష్యముగా, పరమావధిగా భావిస్తున్నారు. ఈ లాంటివాడు కేవలము మాయ మానవుడేకాని, మాధవ మానవుడు కాదు. ఆకార మానవుడేకాని, సాకార మానవుడు కానేరడు. ఇది నాస్తికత్వము.

## స్థూలదేహం- సూక్ష్మదేహం

దీనికి శారీరక, మానసిక తత్త్వాలు కొంతవరకు సహాయకారిగా ఉంటాయి. ఆరోగ్యమైన దేహమందు ఆరోగ్యమైన భావాలే అభివృద్ధి అవుతూ ఉంటాయి. కనుక ఆటలు ఆడటము, పాటలు పాడటము ఆనంద ఆరోగ్యముల నిమిత్తమై ఏర్పడినవనే సత్యాన్ని గుర్తించుకోవాలి. మనకు స్థూల దేహముతోబాటు సూక్ష్మ దేహము ఒకటి ఉన్నది. ఈ సూక్ష్మ దేహము నకు తగిన కృషి చెయ్యాలి. అదే ఆధ్యాత్మిక రంగములో మనము దివ్యత్వముతో, దైవత్వములో చేరే ఆటలు. ఈ ఆటలలో సమైక్యత, సమరసము, సంతోషము అనే మూడు ఫలితములుంటాయి. దేహమనే పాత్రను ఆరోగ్యంగా, ఆనందముగా ఉంచుకోవడానికి ఆటలు అత్యవసరము. సద్గుణములు, సద్బుద్ధి, సత్య నిరతి, భక్తి, కర్తవ్య పాలనము— ఈ ఆటల యందే విద్యార్థి నేర్చుకొనుటకు అవకాశము కల్పింప బడును. ఇవే సూక్ష్మ దేహమునకు తగిన ఆనంద ఆరోగ్యములు అందిస్తాయి. విద్యార్థులు ఆటలతోపాటు గుణములు పోషించుకోవటానికి తగిన కృషి చెయ్య వలెను. ఆటలలో మీకింత పట్టుదల, ఇంత శ్రద్ధ ఏ రీతిగా ఉంటున్నవో, అదే రీతిగా అంతకంటే అధిక ముగా ఆధ్యాత్మిక మార్గములో మీ పట్టుదల, శ్రద్ధలు అభివృద్ధి గావించుకోవాలి. ఈ భౌతిక విద్యలన్నియూ భౌతిక ప్రపంచమునకు మాత్రమే తోడ్పడుతాయి. మానసిక సంబంధమైన శాంతిభద్రతలు చేకూర్చే విద్య ఆధ్యాత్మిక విద్యయే. ఇదే జీవిత పరమావధి.

## వైస్-ఛాంసలర్స్ - త్రయం

మన సరావ్ పరమ భక్తుడు. 5 సం॥ నుండి మీకందరకూ తెలుసు. ఇతను ఇక్కడకు రాకపూర్వం మానవతా విలువలను (Human Values) గూర్చి అనేక గ్రామములకు వెళ్ళి, అనేక రకాలుగా ప్రచారం చేసి, ఎంతో సేవ చేసినవాడు. కేవలము ఇక్కడికి స్వామి యొక్క దయ, ప్రేమల నిమిత్తమై వచ్చిన వాడు. ఉద్యోగ నిమిత్తమై వచ్చినవాడు కాదు. ఈ వయస్సులో శేష జీవితాన్ని పవిత్రమైన, ఆదర్శవంత మైన జీవితంగా తాను అనుభవించి, ఆనందించి, అదే ఇతరులకు అందించాలనేదే అతని ముఖ్య లక్షణము. అతను పిల్లలలో పిల్లవాడు, ఉపాధ్యాయులలో ఉపాధ్యాయుడు, భక్తులలో భక్తుడు. ఇట్టి వ్యక్తి వైస్ - ఛాంసలర్‌గా విద్యాలయానికి రావడం పిల్లల అదృష్టం. గవర్నమెంటు నిబంధనలను పురస్కరించుకొని ఈనాటి నుండి Vcగా విరమించుకోవడానికి పూనుకొన్నాడు. అతని స్థానంలో అటువంటి పవిత్రమైన హృదయం కలిగినటువంటివాడే, తన శేష జీవితమును స్వామి సన్నిధిలో గడుపుకొని, తన జీవితమును సార్థకము గావించుకోవాలనే ఉద్దేశ్యముతో మన సంపత్ వచ్చినాడు. ఈనాటి నుండి అతను ఈ స్థానమును స్వీకరిస్తున్నాడు. వీరిద్దరిని గూర్చి బృందావనం క్యాంపస్ ప్రిన్సిపాల్ శ్రీ కె. అనిల్ కుమార్ కొంత సేపు మాట్లాడగలడు. వీరిద్దరూ సేవా భావముతో ఇందులో పాల్గొనుచున్నారేకాని, తాము చేసే పని జీతముల నిమిత్తమై కాదని చెప్పవలె. వీరిరువురు గౌరవార్థముగా Work చేసేవారు. కాబట్టి సంపత్ తన జీవితాన్ని మన ఇన్‌స్టిట్యూట్‌లో మిమ్ములను ఆదర్శమైన విద్యార్థులుగా తీర్చిదిద్దాలనే ఉద్దేశ్యంతో, అతనికి

లభించిన ఉన్నత పదవులు, ఉత్తమ పదవులు విసర్జించి ఇందులో ప్రవేశించినాడు. ఇటువంటి ఉత్తమ వైస్-ఛాంసలర్ మనకు లభించడము మీ యొక్క మహాభాగ్యము.

మన విశ్వవిద్యాలయము ప్రారంభమైనప్పటి నుండీ మహాపండితుడు, కవి, అన్ని విధములైన శక్తి సామర్థ్యములు కలిగినవాడు గోకాక్ అనే అతను మొట్టమొదట మన ఇన్‌స్టిట్యూట్‌నకు వైస్-ఛాంసలర్‌గా నియమింపబడ్డాడు. అతని తరువాత భక్తి ప్రపత్తులతో సరియైన సేవలను అందించడానికి వచ్చినవాడు సరాఫ్. ఈనాటి నుండి లౌకికంగా, భౌతికంగా, ఆధ్యాత్మికంగా, వైజ్ఞానికంగా ఉత్తీర్ణుడైన సంపత్ Vc పదవి స్వీకరిస్తున్నాడు. మన విశ్వవిద్యాలయమునకు ఈ ముగ్గురు 'ముమ్మూర్తుల' స్వరూపముగా భావింపవచ్చును. వీరు ఎట్టి వాంఛలు లేకుండా, ఎటువంటి పదవీ వాంఛలు లేకుండా, త్యాగభావముతో పదవిని స్వీకరించిన వ్యక్తులు.

విద్యార్థులారా!

వైస్-ఛాంసలర్స్ "Come and go but Swami's Love Comes and Grows". ఎంతమంది వైస్-ఛాంసలర్స్ మారినప్పటికి, వారి ప్రేమకు స్వామి ప్రేమకు, వారి హృదయానికి—స్వామి హృదయానికి సన్నిహిత సంబంధ బాంధవ్యమనేది పెరుగునేకాని, మారదు. 'వైస్-ఛాంసలర్స్' ఛైర్స్ పేర్లు మారవచ్చునేమో కాని, వారి హృదయాలు ఎప్పటికీ మారడానికి వీలుండదు. కనుకనే మన సరాఫ్ ఈ విధమైన ఉద్దేశ్యముతో ఉండడము చేత, అతనిని బయటకు పంపుటలేదు. అతని "శేషజీవిత" మంతా స్వామిసేవ యందు, సమాజసేవ యందు ఆనందముగ అంకితము గావింకోవాలనే ఉద్దేశ్యంతో ఉండటముచేత, అతనిని మా 'సెంట్రల్ ట్రస్టులో' పెట్టుకొని తద్వారా యూనివర్సిటీకి తగిన సంబంధ బాంధవ్యములు పెట్టే నిమిత్తమై నిర్ణయించుకొన్నాము. కనుక సరాఫ్ బయట ప్రదేశానికి వెళ్ళుతాడేమోనని మీరు ఏమాత్రం విచారపడనవసరము లేదు. వీరిరువురు కేవలం స్వామి అండదండలు ఆశించి వచ్చినవారు. కాబట్టి వీరిద్దరూ "రామ లక్ష్మణుల"వలె ఈ కార్యములలోపల తగిన అభివృద్ధిని తెస్తారని ఆశిస్తున్నాను.

విద్యార్థులు స్వార్థ, స్వప్రయోజనముల నిమిత్తమై ప్రాకులాడరాదు. పశు, పక్షి, మృగాదులకైనా స్వార్థరహిత భావమున్నది. ఈనాటి విద్యావంతులలోపల విశాలమైన భావములు ఎక్కడా కనపడుట లేదు. Life is challenge. బయట ప్రపంచానికి పోయినప్పుడు, మీ భావాలకు అడ్డుతగిలేటటువంటి భావాలను ఎదుర్కొని విజయాన్ని సాధించి, బలాన్ని మీరు పెంచుకోవాలి. దీనికి తగిన రీతిగా మన విద్యాసంస్థలో అధ్యాపకులు, వైస్-ఛాంసలరు, రిజిస్ట్రారు, కంట్రోలర్ వీరందరూ తగిన ఉత్సాహ ప్రోత్సాహము లందించుతూనే ఉన్నారు. కాబట్టి విద్యార్థులు తగిన కంకణమును కట్టుకోవటానికి ప్రయత్నించాలి. ఈనాటి ప్రపంచములో సరియైన విద్యను, సరియైన ఆదర్శమును నిరూపించాలి విద్యార్థులు.

విద్యార్థులారా! పవిత్రమైన హృదయాలు కలిగిన వైస్-ఛాంసలర్లను సరియైన రీతిలో మీరు గౌరవించుకొని, వారి ఆదేశములను అందుకొని తద్వారా మీరు ఉన్నత స్థాయిని అందుకుంటారని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

—శ్రీవారి దివ్యబోధ
ఇన్‌స్టిట్యూట్ ఆడిటోరియం,
ప్రశాంతినిలయం, 14-1-1991.



## శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్ (డీమ్డ్ యూనివర్సిటీ)

విద్యాగిరి, ప్రశాంతినిలయం - 515 134, అనంతపురం జిల్లా (ఆం. ప్ర.)

### ప్రవేశ ప్రకటన

1991 జూన్ మొదటి వారంలో ప్రారంభం కానున్న విద్యా సంవత్సరము 1991-92కి ప్రశాంతినిలయం కాంపస్ (పురుషులకు), బృందావనం - వైట్‌ఫీల్డ్ కాంపస్ (పురుషులకు) మరియు అనంతపురం కాంపస్ (స్త్రీలకు) లలో ఆర్ట్స్, సైన్సు, కామర్స్ విషయాలలో అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులున్నాయి.

పంచవర్షీయ ఇంటిగ్రేటెడ్ (మాస్టర్స్) కోర్సుకు గానీ, త్రివర్షీయడిగ్రీ కోర్సుకు గానీ ప్రవేశాలుకోరే అభ్యర్థులు కనీసం 50 శాతం సగటు మార్కులతో 12 ఏళ్ళ ఉన్నత పాఠశాల విద్యాభ్యాసాన్ని గుర్తింప బడిన బోర్డు ద్వారా విద్యార్హతను సంపాదించి ఉండాలి.

అడ్మిషన్ టెస్టుకు మునుపు +2 పరీక్షలో కూర్చొని ఉండవలెను.

ఆర్ట్స్, సైన్సెస్, కామర్స్, బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ (ఎం. బి. ఏ) విషయాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు ప్రశాంతినిలయం కాంపస్‌లో (పురుషులకు), ఆర్ట్సు, (ఫిలాసఫి, ఇంగ్లీషు, తెలుగు), హోంసైన్సు, ఎడ్యుకేషన్ (బి. ఇడి.) విషయాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు అనంతపురం కాంపస్‌లో (స్త్రీలకు) కూడా ఉన్నాయి.

ఎం. బి. ఏ, బి. ఇడి., తదితర పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులలో ప్రవేశాలుకోరే అభ్యర్థులు 15 సం॥ల నియత విద్య అనగా 10+2+3 సంవత్సరాల విద్యాపద్ధతి లేదా దానితో సరిసమానమైన ఇన్‌స్టిట్యూట్‌చే గుర్తింపబడిన విద్యార్హతను పూర్తిచేసి ఉండాలి. ఫైనల్ పరీక్షలో ప్రత్యేక విషయం (సబ్జక్టు) లోను, జనరల్ ఇంగ్లీషులోను కనీసం 50 శాతం మార్కులు సంపాదించి ఉండాలి.

అయితే పోస్టు గ్రాడ్యుయేట్ డిగ్రీ పరీక్షలో 60 శాతం లేదా అంతకన్నా ఎక్కువ మార్కులు సంపాదించినచో, ఈ నియమాన్ని ఇన్‌స్టిట్యూట్ విచక్షణతో సడలింపు చేయవచ్చును. అడ్మిషన్ టెస్టుకు మునుపు గ్రాడ్యుయేట్ / క్వాలిఫైయింగ్ పరీక్ష వ్రాసియుండాలి. అడ్మిషన్ టెస్టుకు అప్లై చేసే అభ్యర్థులు తమ డిగ్రీ ఫైనల్ పరీక్షా ఫలితాలకుగాని, మార్క్సు స్టేట్‌మెంటు కోసంగాని కాచుకోనక్కరలేదు. కానీ, ఫైనల్ పరీక్షకు మునుపు ఉన్న పరీక్షా ఫలితాల ఆధారముపై అప్లైచేయవచ్చును.

అప్లికేషన్ ఫారం, ఇన్ఫర్మేషన్ హ్యాండు బుక్ కోసం ఆసక్తిగల విద్యార్థులు 11వ తారీఖు ఫిబ్రవరి నుండి - ఏప్రియల్ 6వ తారీఖు వరకు పోస్టు ద్వారా తెప్పించుకోవచ్చును. లేదా ఏప్రియల్ 11వ తారీఖు వరకు నేరుగా తీసుకోవచ్చును. పైన తెలుపబడిన వివిధ కోర్సులకు ప్రవేశ పరీక్షలు 1991 మే నెల మొదటి పక్షంలో జరుగును. ప్రతీ కోర్సునకు అప్లికేషన్స్ వేరువేరు విధములుగా, ప్రత్యేకంగా ఉండుటచేత, అభ్యర్థులు తమ వినతిపత్రములలో వారి పేరు మరియు వారు ప్రవేశము కోరుచున్న కోర్సు (సబ్జక్టు) విషయం వివరముగా వ్రాయవలసినది. వినతి పత్రములతోబాటు పి. జి., ఎం. బి. ఎ., బి. ఇడి. కోర్సులకై 45/— రూపాయలు, అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులకై 35/— రూపాయలు ఐ. పి. ఓ. (లేక) బ్యాంకు డ్రాఫ్ట్ ద్వారా— శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్ పేర ప్రశాంతినిలయం — 515 134, అనంతపురం జిల్లా, (ఆంధ్ర ప్రదేశ్) అడ్రస్సునకు పంపవలెను.

రిజిస్ట్రార్.



# అనిర్వచనీయం - ప్రేమస్వరూపం



"ప్రేమరూపము ప్రేమమయం. ఆ ప్రేమరూపమే దైవరూపం. ప్రేమను ప్రేమతో సంధించిన నీమముతో సమానమగును. ఇటువంటి ప్రేమను ఎవడు గట్టిగా కలిగి ఉండునో, అతడు— 'అద్వితీయము' పొందుటకు అర్హుడగును".

"పలుకులు మహారుచికరములు, పరిమళములు, అతిమధుర మకరంద ద్వంద్వములు. ఈ పలుకులే నాలుగు వేదాలు - శ్రుతి స్మృతులు. ఇట్టి పలుకులే బంధ - మోక్ష, సుఖదుఃఖ కారణాలు. ఈ పలుకులను ఎవడు ప్రేమ బోధలచేత పొందుపరచి, సమత, మమతలను కలునట్లు 'మానవతా విలువల'ను తెలుపుచుండునో, అతడే-దైవతత్త్వమని చెప్పవలె".

ప్రేమస్వరూపులైన విద్యార్థులారా! విద్యాబోధకులారా! విద్యాభిమానులారా!

ప్రేమ గుణాతీతమైనది. క్షణ క్షణమునకు అభివృద్ధిని పొందటమే దీని స్వభావము. ఈ ప్రేమ అవిరామంగా, అనంతంగా, అమృతధారలుగా ప్రవహిస్తుంది. దీనినే ఋషులు— "ఆత్మ" అని పిలుస్తారు. ఇది హృదయము నుండి ఆవిర్భవిస్తుంది. ఈ ప్రేమ సాధకుని మనస్సును దైవము వైపునకే ప్రసరింప జేస్తూ ఉంటుంది. ప్రేమ పోకడ ఒక దిక్సూచి వంటిది. ఈ దిక్సూచిని ఎక్కడ పెట్టినప్పటికీ, ఆ ముల్లు ఉత్తర దిశనే చూపిస్తుంది. ప్రేమకు ప్రత్యేకంగా "తన— పర" అనే తారతమ్యాలుండవు. ఇందులో స్వార్థపరులకు స్థానము లేదు. అందులకే— "అనిర్వచనీయం - ప్రేమ స్వరూపం" అని చెప్పబడింది. భాషలు కాని, కవిత్వముకాని, పాండిత్యముకాని ఈ ప్రేమను వర్ణించలేవు.

## అనురాగము - ప్రేమ

జగత్ వ్యవహారములలో ఈ ప్రేమ రెండు విధాలుగా నిరూపిస్తుంది, ఒకటి అనురాగమని, రెండవది ప్రేమ అని. ప్రేమ ఒక్కటే అయినప్పటికీ, దీని అనుభూతులను పురస్కరించుకొని వివిధరూపాలు ధరిస్తూంటుంది. ప్రేమను ప్రాకృత వ్యవహారమందు ప్రవేశపెట్టినప్పుడు 'అనురాగమని' పిలువబడుతుంది. ఈ అనురాగంలో సుఖముతోబాటు దుఃఖము ఉంటుంది, రాగముతోబాటు ద్వేషము ఉంటుంది. ఈ సుఖదుఃఖములతో, రాగద్వేషములతో కూడినదే అనురాగము. ఇది మనస్సు నుండి ఆవిర్భవిస్తుంది. ప్రేమ అట్టిది కాదు. దుఃఖమునకు, రాగద్వేషములకు ఇందులో యేమాత్రము అవకాశం లేదు. ఎక్కడ రాగద్వేషములు, దుఃఖము ఉంటాయో; అక్కడ అది నిజమైన ప్రేమ కానేరదు. ఇది కేవలం అనురాగము యొక్క ప్రభావము.

"ప్రేమకు ప్రేమయే సాటి. ప్రేమకు ఫలితం ప్రేమయే. ప్రేమ మాధుర్యమును ప్రేమ మాత్రమే గుర్తింపగలదు. అన్యము గుర్తించుటకు అలవికాదు'. ఈనాడు జగత్తులో ప్రేమతో అనుభవిస్తున్న సంబంధ బాంధవ్యములన్నియూ అనురాగముతో కూడినవేకాని, పరిశుద్ధమైన ప్రేమకు సంబంధించినవి కావు. ఈనాడు మానవుడు ప్రపంచములో ఏ పదార్థం కోరినప్పటికిని, పదార్థ నిమిత్తమై తాను పదార్థమును ప్రేమించుట లేదు. తన నిమిత్తమై పదార్థమును ప్రేమిస్తున్నాడు. ఏ వ్యక్తిని ఎవరు ప్రేమించినప్పటికీ, వ్యక్తి నిమిత్తమై ఆ వ్యక్తిని ప్రేమించుట లేదు. కేవలం తన నిమిత్తమై ఆ వ్యక్తిని ప్రేమిస్తున్నాడు. ఈ విధముగా తల్లీబిడ్డలైనప్పటికినీ, తల్లి ప్రేమ - తల్లి నిమిత్తమై ఆ బిడ్డను తాను ప్రేమిస్తున్నదికాని, బిడ్డ నిమిత్తమైకాదు. ఇదే విధంగనే భార్య - భర్తనుగాని, భర్త - భార్యనుగాని, తమ తమ స్వార్థముల కోసమే, ఒకరినొకరు ప్రేమించుచున్నారే కానీ, ఒకరి కోసం ఒకరు ప్రేమించుటలేదు. ఇదే అనురాగము యొక్క వము.

## స్వార్థం - స్వప్రయోజనం

ఈనాడు కలి ప్రభావము చేత దైవప్రేమను మానవులు ఇదే విధముగా అనుభవిస్తున్నారు. దైవం నిమిత్తమై - దైవమును ప్రేమించుట లేదు. తమ నిమిత్తమై - దైవమును ప్రేమిస్తున్నారు. నిజంగా భగవంతుని నిమిత్తమై ప్రేమించినట్లయిన, ఆ ప్రేమలో రాగమునకుగాని, ద్వేషమునకుగాని, దుఃఖమునకుగాని అవకాశము ఏమాత్రమూ ఉండదు. నేటి మానవుడు తనలో స్వార్థమును, స్వప్రయోజనమును లక్ష్యమునందు పెట్టుకొనుట చేత, తన ప్రేమను మాలిన్య పరచుకొనుచున్నాడు. కాబట్టి, మానవుడు తన జీవితమును స్వార్థమనే దానిలో "కీలుబొమ్మ"గా జీవిస్తున్నాడు. స్వార్థం, స్వప్రయోజనం లేకుండా తాను ఒక్క అడుగైనా ముందడుగు వేయుటకు ప్రయత్నించుట లేదు. అన్నింటి యందు దివ్యత్వమైన ఆత్మ తత్త్వము ఉన్నదనే సత్యమును మానవుడు గుర్తించుకొనుటకు ప్రయత్నించుట లేదు.

నేడు జగత్తునకు కావలసినవి క్రొత్త పద్ధతులు కావు. క్రొత్త చదువూ, క్రొత్త మతమూ, క్రొత్త సాంప్రదాయమూ కాదు. గుణవంతులైన స్త్రీ పురుషులు, శీలవంతులైన బాలబాలికలు నేటి జగత్తునకు చాలా అత్యవసరం. ఇది కేవలం ఒక్క ఆధ్యాత్మిక మార్గము నందే అభివృద్ధిని పొందునుకాని, అన్యమార్గముల ద్వారా వీలు కానేకాదు — అసాధ్యము. ఈనాడు నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక మార్గములలో ఈ విధమైన మార్పులు కలగడానికి మూలకారణము ఏమిటి? అని విద్యార్థులు విచారించాలి. పూర్వం కంటే ఈనాడు మానవుని యందు స్వార్థం, సంకుచిత భావాలు అధికమైపోయినాయి. దీనికి కారణమేమని మనం విచారిస్తే, స్వార్థము - స్వప్రయోజనములతో కూడిన పశుత్వమే మూలకారణమని అనిపిస్తుంది. మానవుని యందు దివ్యత్వం, మానవత్వం, పశుత్వం—మూడు ఏకమై ఉంటున్నాయి. మానవత్వము నుండి దివ్యత్వమునకు పోదలచిన మానవుడు, మానవత్వము నుండి పశుత్వమునకు దిగజారుట చేతనే ఇన్ని విధములైన మార్పులు కలుగుటకు హేతువైనది. మానవత్వంలో ఉండిన దివ్యత్వమును విస్మరించి పశుత్వమును పెంచుకొనుటయే దీనికి హేతువు. స్వార్థము, స్వప్రయోజనము సాధ్యమైనంత వరకు విద్యార్థులు తమలో అరికట్టడానికి ప్రయత్నించాలి.

## 'దీర్ఘజీవితం'కాదు - 'దివ్యజీవితం'కావాలి

మానవుడు సమాజమునందే పుట్టి, సమాజమునందే పెరిగి, సమాజమునందే జీవిస్తున్నాడు. సమాజ అభివృద్ధిని, సమాజ క్షేమాన్ని దృష్టి యందుంచుకోవాలి. మన కుటుంబ శాంతిని, మన గృహము నందే అభివృద్ధి గావించుకోవాలి. కుటుంబములో శాంతిలేని

మానవుడు, సమాజములో శాంతిని ఏ విధంగా కల్పిం చగలడు? కుటుంబములో శాంతిని పోషించాలంటే, వ్యక్తిలో శాంతిని పెంపొందించాలి. అందుకోసము మానవుడు దుర్భావములను అణగ్రదొక్కుకొని, తన యందున్న దివ్యమైన భావాలను పోషించుకొనుటకై తగిన కృషిని చెయ్యాలి. కానీ, ఈనాటి మానవుడు 'దీర్ఘజీవితాన్ని' ఆశిస్తున్నాడేకాని, 'దివ్యమైన జీవితాన్ని ఆశించుటలేదు. 'దివ్యమైన జీవితము' ను అనుభవించటానికి తగిన కృషిచేయాలి అంతేకాని, దీర్ఘమైన జీవితం కోసం కాదు.

## పారమార్థిక జలం

జలము ఉండినప్పుడే అలలు ఆరంభిస్తాయి. అలలు ఉండినప్పుడే, అందులో నురుగేర్పడుతుంది. అలలు వదలి నురుగు, జలము వదలి అలలు ఉండుటకు వీలుకాదు. అందుచేతనే పారమార్థికమనే జలమునందు, వ్యవహారికమనే అలలు ఆరంభించి, ఆ అలల యందు సుప్రభాత జ్ఞానమనే నురుగు వస్తూ ఉంటుంది. ప్రాతిభాసికము అని ఈ నురుగునే చెప్పుచున్నారు. వ్యవహారికము నందు మరియు ప్రాతిభాసికము నందు పారమార్థికమనే జలం సమముగానే ఉంటుంది. మాధుర్యము, పల్చదనము, తీపి మున్నగునవి ఏ జలములో ఉన్నవో, ఆ జలము యొక్క స్వభావమే ఆ అలల యందు, నురుగునందు కూడి ఉంటుంది. మనము ఈ ప్రాతిభాసికమందు, పారమార్థికమందు, సమముగా అనుభవించినప్పుడే ఈ ప్రేమ తత్త్వము, ఒక విధమైన సమత్వముగా, స్థిరత్వముగా, అమరత్వముగా, అఖిలంగా — ఉంటుంది.

## జీవితమే ఒక ఆట

"Life is a game play it. Life is a dream realise it. Life is Love enjoy it".

ఈనాడు పోరాడవలసినది, విజయాన్ని సాధించవలసినది జీవిత పోరాటము. అదే ఒక ఆట. మనము ఈనాడు ప్రేమ ప్రేమ అని భావిస్తున్నాము. అది కేవలం భావన మాత్రమేకాని, నిజమైన ప్రేమ కాదు. ఈ ప్రేమయే మన హృదయంలో ఆవిర్భవించి ఉండిన ఇందులో అశాంతికి గాని, దుఃఖమునకు గాని, రాగమునకు గాని, ద్వేషమునకు గాని ఏ మాత్రమూ అవకాశము ఉండదు. ఎక్కడ రాగద్వేషములు, దుఃఖములు ఉన్నవో, అక్కడ సరియైన ప్రేమ లేదని మనకు మనమే నిర్ధారించుకోవచ్చు. అందుచేతనే భగవంతుడు అంత సులభంగా మనకు చిక్కుట లేదు. హృదయ సంబంధమైన ప్రేమను మీలో అభివృద్ధి పరచుకొనుటకు ప్రయత్నించాలి.

## ఆట పాటలు

మీరు ఆటల పోటీలని ఆటలు ఆడటం, పాటలు పాడటము చేస్తున్నారు. ఇవి ప్రాచీన కాలములో ప్రారంభమైనట్టివే. ఈ ఆటలు పాటలలోనే వివిధ మతములు ఐకమత్యమనే దానిని అభివృద్ధి పరచుకొనే నిమిత్తమై ఈ ఆటలు ఏర్పడినవి. ఈ ఆటలు ఆడటం చేత, దేహము ఆరోగ్యకరముగాను, పుష్టికరముగాను, తుష్టికరముగాను ఉంటుంది. ఈ ఆటలలో క్రమశిక్షణ ఎవ్వరూ పాటించుట లేదు. విజయాన్ని మాత్రమే ఆశిస్తున్నారు. ఆనందము, ఆరోగ్యము, సంతృప్తి, క్రమశిక్షణ ఈ నాల్గింటి నిమిత్తమై ఆటలు ప్రారంభమైనవి. ఆనందాన్ని అభివృద్ధిపరచే నిమిత్తమై పాటలు ఏర్పడ్డాయి. కనుకనే, గానం ఆనంద సమయములోనే ఆవిర్భవిస్తుంది. పూర్వకాలం స్త్రీలంతాచేరి నలుగు పాటలని, మంగళహారతి పాటలని, అప్పగింతల పాటలని — ఎంతో ఆనందంగా పాడుతూ ఉండేవారు. ఈనాడు పెండ్లికి ఎవ్వరినైనా పాటలకని పిలిస్తే, "ఎంత ఇస్తారు?" అని అడుగుతారు. వ్యాపార సంబంధమైన పాటలుగా రూపొందుతూ వచ్చాయి. విద్యార్థులందరూ మీ ఆటలుకాని, పాటలుకాని ధన నిమిత్తం కాక, హృదయానందం కోసమని చక్కగా గుర్తించి మీజీవితాన్ని ఆనందమయముగా అభివృద్ధి చేసుకోండి.

## వీడ్కోలు — స్వాగతం

"జీవితం" అనే పదములో మనమేమి సాధించామంటే— "జీవితం" అనే పదములోని చివర "సున్న"ను మనము సాధించినాము. అదే "జీరో". ఇది కాదు మానవుని ఆదర్శం. మానవుడు సద్గుణములను పోషించుకొని, విజయాన్ని సాధించాలి. మానవుడు గుణవంతుడుగాను, బలవంతుడుగాను, ఆనందవంతుడుగాను ఉండాలనుకుంటే దివ్యమైన భావాలు పోషించుకోవాలి. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు— అనే ఆరు గుణములు మనలో అరిషడ్వర్గములుగా రూపొందుతూ వచ్చాయి. ఈ ఆరింటిని మనం దూరం చేసి, పై ఆరింటి స్థానంలో- Character, Pity, Non-Violence, Control of Mind, Love, Truth— ఈ ఆరింటికి స్థానం ఇచ్చి ఒకటి వీడ్కోలు (Send off), మరొకటి స్వాగతం (Welcome) చేయాలి. ఈ విధముగా చేసినచో ఇది మానవుని ఉన్నత వ్యక్తి (Supreme) గా మారుస్తుంది.

## ఉన్నత లక్ష్యం సాధించండి

విద్యార్థులారా! మీ వయస్సు చాలా పవిత్రమైన వయస్సు. ఈ వయస్సునందే దివ్యమైన భావాలు నింపుకోవాలి. వర్షాకాలములో చెఱువులకు నీరు నింపుకొన్నప్పుడే, ఎండాకాలంలో దానిని వినియోగించుకోవడానికి వీలవుతుంది. ప్రారంభ జీవిత సమయమందే పవిత్రమైన భావాలు నింపుకొన్నప్పుడే, భవిష్యత్తులో ధన్యులు కావచ్చును. బాహ్య సంబంధమైన ప్రపంచముతో పోల్చుకొనక, మీ దివ్యమైన భావాన్ని మీరు అభివృద్ధి పరచుకొని, దానిని విశాలము గావించుకొనే రీతిగా ప్రయత్నించాలి. మీరెప్పుడూ పైకి చూడండి. క్రిందికి చూడకండి. Look up, Low aim is Crime. ఇట్టి లక్ష్యమును మీలో పెట్టుకోండి. అప్పుడే కించిత్తైనా ఉపయోగమైన దానిని సాధించవచ్చు. వెంబడి "కుంటి నక్కను కొట్టే దానికంటే, గురి తప్పిననూ పులినే కొట్టమన్నారు". మీరెప్పుడూ 100 Per cent తెచ్చుకొని Pass కావాలి అనే లక్ష్యముతో చదవండి. కనుక విద్యార్థులందరూ పరీక్షలలో నూటికి నూరు ఫలితాలను పొందాలి. మన విద్యాసంస్థయందు ఆదర్శవంతమైన విద్యార్థులుగా తయారై ప్రతి విషయమందు సత్యమును, ప్రేమను, మనోరంజితమైన భావాలను అభివృద్ధి పరచుకోవాలి. మీరు ఈ ప్రేమ తత్త్వమును అభివృద్ధి పరచుకొంటే, ఈ ప్రేమాస్త్రముతో సర్వమూ సవ్యముగా మారిపోతాయి. ప్రేమ లేకపోతే తల్లైనా నిన్ను ప్రేమించదు. దేహ సంబంధమైన ప్రేమతోబాటు, ఆత్మ సంబంధమైన ప్రేమను అభివృద్ధి పరచుకోవాలి.

—శ్రీవారి దివ్యబోధ
ఇన్‌స్టిట్యూట్ ఆడిటోరియం,
ప్రశాంతినిలయం,
20—1—1991.



# సత్యసాయి క్రీడారంగం

ప్రతీ సంవత్సరం ప్రశాంతినిలయంలో అత్యద్భుతమైన, ప్రమోదభరితమైన, విద్యార్థినీ విద్యార్థుల ఆటల పోటీలు జరుగుతూనే ఉంటాయి. ఇందులో అటు బృందావనం కాంపస్, ఇటు ప్రశాంతినిలయం కాంపస్ విద్యార్థులు, మరి అటు అనంతపురం కాంపస్ విద్యార్థినిలు— భగవానుని సమక్షంలో తమ తమ క్రీడా కళా కౌశలమును ప్రదర్శిస్తూ ఉంటారు. ఇట్టి మహత్తర సన్నివేశమును తిలకించుటకై దేశ విదేశస్థులందరూ వచ్చి ప్రేక్షకులుగా పాల్గొంటారు. అటులనే ఈ సంవత్సరము కూడా శ్రీ సత్యసాయి ఇన్స్టిట్యూట్ అఫ్ హైయర్ లెర్నింగ్ ఛాంసలర్ భగవాన్ బాబావారు జనవరి 11వ తేదీ శుక్రవారం ఉదయము 7 గంటలకు శ్రీ సత్యసాయి హిల్ వ్యూ స్టేడియం వద్దకు 7గురు బాలకులు, ఇద్దరు బాలికలు తమ మోటారు సైకిళ్ళపై "పైలట్సు"వలె సాగిపోవుచుండగా రథంపై విచ్చేసినారు. రథమునకు ఇరువైపుల వైస్-ఛాంసలర్, అనంతపురం కాంపస్ ప్రిన్సిపాల్ వచ్చి స్వామివారిని ప్రముఖ అతిథిగా దయచేయమని పుష్పాంజలి సమర్పించుకొన్నారు. ఇన్స్టిట్యూట్ వారి బ్యాండు ముందు సాగుచుండగా స్వామివారు శాంతివేదికను సమీపించినారు. 21 సార్లు ప్రేల్చబడు తుపాకీ వందనముతో స్వామివారిని ఆహ్వానించారు.

బాబావారు శాంతివేదికపై తమ ఉన్నతమైన ఆసనమును అలంకరించిన పిదప, స్వామివారికి కుడివైపున వైస్-ఛాంసలరు డా॥ సంపత్, ఎడ్యుకేషన్ ట్రస్టు సదస్యులు, ఎడమ ప్రక్కన డా॥ మఱ్ఱి చెన్నారెడ్డి (మాజీ ముఖ్యమంత్రి, ఆంధ్ర ప్రదేశ్) ఆసీనులై నారు.

బృందావనం కాంపస్ వారు తయారుచేసిన రాజహంస, "Purity, Unity, Divinity"— అనే స్లోగనుతో ప్రేక్షకులను సమీపిస్తూ, స్వామివారి ముందు నుండి తరలి వెళ్ళినది.

బాబావారు "మార్చ్‌పాస్టు" జరుగుచున్నంతసేపు నిలబడి వందనము అందుకొన్నారు.

ఇన్స్టిట్యూట్ బ్యాండు శ్రీ ఫెర్గూసన్, అమెరికన్ జాజ్ బ్యాండు మాస్టర్ ఆధ్వర్యాన అప్రతిమాన నైపుణ్యంతో తమ ప్రతిభను ప్రకటించుచుండగా, శ్రీ సందీపన్ ఛటర్జీ ఇంగ్లీషు లెక్చరర్ వ్యాఖ్యానము చేస్తుండగా, ప్రైమరీ స్కూల్ విద్యార్థినీ విద్యార్థులు రంగు రంగుల అత్యంత ఆకర్షణీయమైన దుస్తులలో సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింస-విభాగాలు ( Houses ) గా స్వామికి వందనము చేస్తూ వెళ్ళినారు. వారి వెనుకనే హైయర్ సెకండరీ విద్యార్థినిలు, అనంతపురం జూనియర్ కాలేజీ విద్యార్థినిలు, అనంతపురం కాంపస్ విద్యార్థినిలు తరువాత హైయర్ సెకండరీ స్కూల్ విద్యార్థులు, ఇన్స్టిట్యూట్ విద్యార్థులు— వరుసగా స్వామికి వందనములు అర్పించి, ముందునకు సాగిపోయినారు. బ్యాండుకు అనుగుణ్యముగా, క్రమశిక్షణతో మార్చ్‌పాస్టు చేయునప్పటి ఆ దృశ్యం భక్తుల హృదయాలను రంజింప జేసినది.

ఈ కార్యక్రమము తరువాత భగవాన్ బాబా వారు శాంతివేదిక నుండి క్రిందకు దిగివచ్చి "పతాక" ఆవిష్కరణ గావించినారు. "క్రీడోత్సవ జ్యోతి" ని వెలిగించి, అటుపిమ్మట ప్రేమ, శాంతి స్వరూపము లుగా భావింపబడే రెండు శ్వేత పావురములను ఆకాశము వైపునకు విడిచిపెట్టినారు. వివిధ రంగులలో గాలిబుడగలను ఆకాశ మార్గమునకు పంపినారు. ఈ క్రీడోత్సవ జ్యోతిని అందలందలుగా, మైదానం చుట్టూ విద్యార్థులు పరుగెత్తుతూ, హిల్‌వ్యూస్టేడియం నందలి కొండశిఖరముపై, క్రొత్తగా ప్రత్యేకంగా నిర్మించిన స్తంభముపై ప్రతిష్టించినారు.

ఇన్‌స్టిట్యూట్ కెప్టెన్ క్రీడోత్సవ శపథము (Pledge) మైకులో భావ గాంభీర్యముతో చదువుచుండగా, వేలాది విద్యార్థినీ విద్యార్థులు దానిని అనుసరిస్తూ సక్రమమైన పద్ధతిలో పునశ్చరణ గావించినారు. అటు తరువాత విద్యార్థినీ విద్యార్థులు మార్చ్‌పాస్టు రిట్రీట్‌గా తమ తమ స్థానములకు బ్యాండు వాద్యాలకనుగుణ్యముగా వెళ్ళినారు. అటుపిమ్మట సాంస్కృతిక కార్యక్రమములు ప్రారంభములైనాయి.

ప్రైమరీ స్కూలు పిల్లలు మనోరంజకమైన రంగు రంగుల దుస్తులతో రికార్డు చేయబడిన సంగీతమునను సరించి ధైర్యోత్సాహములతో వివిధ భంగిమలలో, రంగు రంగుల గొడుగులతో అద్భుతమైన నాట్యం చేసినారు.

బాలురు వివిధమైన భంగిమలలో "పిరమిడ్లు" ఆకృతులను ప్రదర్శించినారు. కొందరు బాలికలు తుమ్మెదలవలె రెక్కల ఆకారంలో నాట్య ప్రదర్శన చేసినారు పద్మపత్రముల వలె, వికసించిన పద్మముల వలె వస్త్రాలంకారములు చేసుకొని, అత్యద్భుతముగా నాట్య ప్రదర్శన గావించినారు. కొందరు బాలురు చెక్క గుఱ్ఱముపై దూకటము, పల్టీలు కొట్టటము ప్రదర్శన గావించినారు. బృందావనం బాలురు — కార్లను అతివేగంగా నడిపే విధానమును ప్రదర్శించినారు. ఈ ప్రదర్శనలో కార్లను అతివేగంగా, ప్రమాదకరంగా నడిపిస్తున్నా, టాపుపైన ఉన్న విద్యార్థులు ఏమాత్రము కదలకుండా, బ్యాలెన్స్ తప్పకుండా వారును అంటి పెట్టుకొనే ఉన్నారు. అతి సాహసంగా కార్లపైన పిరమిడ్లు ఏర్పాటు చేయటము, ఒకే కారు టాపుపైన పది మంది పిల్లలు స్వారీ చేయటమనే — అతిసాహస కృత్యాలు చేసినారు. రెండు కార్లు ప్రక్క - ప్రక్కన నిలబడి ఉన్నప్పుడు ఆమధ్యలో ఒక 'రింగుకు' నిప్పు అంటించి దాని మధ్యలో దూకటం అనే ప్రక్రియలు చూపించినారు. జీపు వెనుక నుండి "ప్యారాచూట్" సహాయముతో ఆకాశముపైకి వంద అడుగులు ఎగిరి, తిరిగి అతిసునాయాసంగా క్రిందికి దిగటం జరిగింది. ఇట్టి సాహస కృత్యములు కేవలం భగవానుని ఆశీస్సులతో ప్రమాద రహితంగా, ప్రమోద భరితముగా తనరారినవి. "Forever yours" అనే స్లోగనుతో వారి ప్రదర్శన ముగించినారు.

జాతీయసమైక్యతను నిరూపించు, సర్వమత సమానత్వాన్ని ప్రదర్శించు, వివిధ రాష్ట్రాల నృత్య భంగిమలు అతిమనోహరంగా జరిగినవి. ఈ సన్నివేశము ఎద్దులబండి, ట్రాక్టర్లు, సర్వమత సమావేశము మున్నగునవి కలిగి ఉన్నది. ఈ దృశ్యంలో బాలురతో బాటు, బృందావనం ప్రిన్సిపల్, వార్డెన్ పాల్గొన్నారు. ఆనాటి ప్రాచీనకాలపు "పల్లెటూరి వాతావరణము"ను సృష్టించినారు. బెంగుళూరు- Aeroclub ఇన్‌స్ట్రక్టర్, "గ్లైడరు"పైన ఆకాశములో ఎగరడం, తిరిగి క్రిందికి దిగడం, స్వామికి నమస్కరించడము- తిరిగి ఆకాశముపైకి ఎగిరి విమానాశ్రయమువైపునకు వెళ్ళినాడు.

అనంతపురం క్యాంపస్ బాలికలు జండాలతో స్వామికి ప్రణామములు సమర్పించి తమ ప్రదర్శనను ప్రారంభించినారు. "భవసాగర తరణి" అనే స్లోగనుతో త్రేతాయుగములో శ్రీ రామచంద్రుడు గుహుని పడవలో ప్రయాణము చేసిన దృశ్యము, "సత్య ధర్మ బోధిని" — అనే స్లోగనుతో ద్వాపరయుగంలో

శ్రీ కృష్ణుడు అర్జునునికి "గీత" బోధించుచూ రథములో సాగటము, "శాంతి ప్రేమప్రదాయిని"— అనే స్లోగనుతో కలియుగంలో బాబావారు "సాయివిహంగ్" అనే Aeroplane ఉపయోగించటం ప్రదర్శించినారు. త్రాళ్ళపై ఎత్తుగా వ్రేళ్ళాడుతూ, ఆసనాలు ప్రదర్శించినారు. పిరమిడ్ల ఆకృతిలో నిలబడటం, సైకిల్ పై వివిధ భంగిమలలో విన్యాసాలు ప్రదర్శించడం జరిగినది. "టైట్ రోప్ వాకింగ్" — త్రాటిపైన నిలబడి నెత్తిపైన పెట్టిన కుండ కదలకుండా బ్యాలెన్సు చేస్తూ నడవటము, ఎత్తుగా కట్టిన త్రాళ్ళపై "మోనాసైకిళ్ళ" పై ఇద్దరు బాలికలు ముందునకు, వెనుకకు వెళ్ళటము, బాలికలు అందరు తెల్లని దుస్తులను ధరించి Figure Marching అనగా వివిధ మతచిహ్నాలుగా ఆకృతులు ప్రదర్శించుట మున్నగునవి ప్రదర్శించినారు.

ప్రశాంతినిలయానికి చెందిన విద్యార్థులు— "పిరమిడ్ల" ఆకృతులు, "జూడో" విద్యను అత్యద్భుతముగా ప్రదర్శించినారు. ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులు మోటారుసైకిళ్ళపైన చేతులను, కాళ్ళను వదలి అనేక రకములైన విన్యాసములు సాహసంగా చేసినారు. ఒక రాంప్ నుండి ఇంకొక రాంప్‌కు దూకటం, ఒక రాంప్ నుండి ఒక ట్రక్కు వెనుక భాగములోనికి ఎగరటం, రాంప్-రాంప్‌ల మధ్యనున్న పది అడుగుల స్థలములో 7గురు పడుకున్నప్పటికీ, రాంప్ నుంచి రాంప్‌పైకి దూకినారు. మరొకసారి రాంప్ నుంచి మరొక రాంప్‌కు దూకుతున్న సమయంలో ఆ రాంప్‌ల మధ్య ఇద్దరు మోటారు సైకిళ్ళను నడిపించినారు. మరొకసారి ఆ రాంప్‌ల మధ్యనున్న స్థలములో మంటలు, పొగలు చెలరేగుచున్నా ఒక రాంప్ నుండి మరొక రాంప్‌కు దుమికినారు.

రెండు వైర్ సురంగాలలో (Tunnel) మోటారు సైకిళ్ళపై పడుకొని, అవల ప్రక్కకు వెళ్ళినారు. అదే సురంగముపై మంటలు మండుతున్నా, మధ్యలో నుండి ఇరుప్రక్కల నుండి ఆ సురంగాలలో ఇద్దరు మోటారుసైకిళ్ళపై రావడము గావించినారు. ఒక విద్యార్థి తన పొట్టపై ఒక పలకను పెట్టుకొని పరుండగా, దానిపైన ఒకటి రెండు మోటారుసైకిళ్ళు వెళ్ళటం జరిగింది. ఒకే మోటారుసైకిల్‌పై ముగ్గురు స్వారీ చేసినారు. రెండు మోటారు సైకిళ్ళు వేరు వేరు దిక్కులలో నిలబడినప్పుడు, ఆ రెండింటికీ మధ్యలో, మరొక విద్యార్థి తన శరీరమునకు త్రాళ్ళు కట్టుకొని, ఆ మోటారుసైకిళ్ళకు కట్టి, ఆ మోటారు సైకిళ్ళను నడుపగా వాటి వేగమును ఆపివేసినాడు. "Cosmic Riders" అని గుర్తింప జేసినారు వీరు.

ఈ క్రీడోత్సవాలకు ముందు 9వ తేదీన స్వామి వారి సమక్షములో STAFF SPORTS (ఉపాధ్యాయులు తదితర ఉద్యోగస్తులు) జరిగినవి. వీరు గావించిన వివిధ క్రీడలను స్వామివారు తిలకించి వారిని ఆశీర్వదించినారు.

సాంస్కృతిక కార్యక్రమాలలో ప్రశాంతి నిలయం కాంపస్ వారి గానప్రదర్శన, Staff వారి గానకుసుమాంజలి, బృందావనం కాంపస్ వారి గాన ప్రదర్శన మరియు "కరిష్యే వచనం మమ" అనే నాటకము ప్రేక్షకులను అమితంగా ఆకట్టుకున్నాయి. ప్రత్యేకించి ఈ నాటకాన్ని స్వామివారి ఆదేశముతో పూర్ణచంద్ర ఆడిటోరియంలో మళ్ళీ ఒకసారి భక్తుల ఆనందమునకై ప్రదర్శించడం జరిగినది.

ఆటలు, సాంస్కృతిక కార్యక్రమాలు జనవరి 11, 12, 13 తేదీలలో జరిగినవి. ఈ సందర్భమును పురస్కరించుకొని 14వ తారీఖున ఇన్‌స్టిట్యూట్ ఆడిటోరియం నందు విజేతలందరికీ బహుమతులను, సర్టిఫికేట్‌లనూ బాబావారు స్వయంగా అందజేసినారు. విశేషప్రతిభకు బృందావనం కాంపస్‌కు, శౌర్య, ధైర్య, సాహసాలకు ప్రశాంతినిలయం కాంపస్‌కు, పూర్ణ నిమగ్నతకు అనంతపూర్ కాంపస్‌కు, చక్కని ఆహ్లాదకరమైన నాట్యములకు ప్రైమరీ స్కూల్‌నకు బాబావారు ప్రత్యేక బహుమతులను, షీల్డులను అందించినారు.

ఈ సందర్భంగా శ్రీవారు దివ్యోపన్యాసమును అనుగ్రహించినారు. భగవాన్ డా॥ సరాఫ్‌గారికి వీరి Vc పదవీ విరమణ సందర్భమును పురస్కరించుకొని "బంగారు ఉంగరము"ను సృష్టించి వ్రేలునకు పెట్టి, అటుపిమ్మట రెండు హస్తములకు "బంగారు మురుగులు" తొడిగినారు.

20-1-'91 న ఇన్‌స్టిట్యూట్ ఆడిటోరియంలో శ్రీ సత్యసాయి హైయర్ సెకండరీ స్కూల్ విద్యార్థులకు బాబావారు ఆటలపోటీలలో గెలుపొందిన విజేతలందరికీ స్వయంగా బహుమతులను అందజేసినారు. ఈ సందర్భమున స్వామివారు విద్యార్థులను ఉద్దేశించి ప్రసంగించినారు. ఈరీతిగా "సత్యసాయి క్రీడోత్సవాలు" వైభవోపేతముగా, అత్యద్భుతముగా విజయగీతమును పాడుకొన్నవి.

—"కవికుమార్"
ప్రశాంతినిలయం.



## దివ్యసందర్శనము

సంస్థాపనార్థమ్ము తా జన్మించు
నవిన శ్రీ కృష్ణుడె - మనదు సాయి
భూలోక వైకుంఠముగ పుట్టపర్తిని
బాగుజేసిన పరబ్రహ్మ సాయి
భక్తరక్షణ కళా పారీణుడైనట్టి
శ్రీ మహావిష్ణువే - స్వామి సాయి
దుర్మార్గతత్త్వాల దునుమ విజృంభించు
మహితదుర్గాదేవి - మహిని సాయి

ఆది మధ్యాంత రహితుడై యలరునట్టి
సత్యసాయీశు దర్శించు జనుడె జనుడు
అతని సేవించి ధాత్రిలో అలరుడోయి!
జన్మ ధన్యంబునగును నిస్సంశయముగ!!

—భల్లం తిరుపతిరాజు (కవిటం)

## అర్చన

ఆర్తసేవాపరాయణుల ప్రార్థనల నా
లించి లాలించి పాలించు స్వామి
కరుణాంతరంగ గంగా తరంగాలు పొం
గారు రంగారు బంగారు స్వామి
హరివిల్లు మోపెట్టి అనురాగలహరి చూ
పెట్టి రాపట్టి చేపట్టు స్వామి
తీయ తీయని భారతీయ సంస్కృతి కటా
క్షించి వీక్షించి రక్షించు స్వామి

జాలిగల స్వామి మేలి వరాల స్వామి
నిత్య సౌభాగ్యదాయి శ్రీ సత్యసాయి
అఘములు దహించి భయము పోకార్చుగాక!
అర్చన గ్రహించి జయము చేకూర్చుగాక!!

—కరుణశ్రీ

# సాధనాపథంలో
# భారతీయ పరమార్థ వాహిని

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి వాహినిలన్నింటిలోనూ భారతీయపరమార్థవాహిని, సత్యసాయి వాహిని అనేవి రెండూ భావగాంభీర్యంలోను, భాషాపాటవంలోను, చెప్పే తీరులోను (అభివ్యక్తి అంటారు) ఎంతో విశిష్టమైనవి. అయితే, ఈ రెండింటినీ "సత్యసాయి వాహిని" పేరుతోనే ఒక పుస్తకముగా ప్రచురించటముచేత "భారతీయ పరమార్థ వాహిని" అనే పుస్తకాన్ని చూడలేదే అనేవారున్నారు. ఈ రెండు వాహినులను ఒకే పేరుతో "సత్యసాయి వాహిని"గా ప్రచురించారు. ఇందులో మనకు ఒక సూచన కనబడుతుంది. యుగ యుగాలుగా వస్తున్న భారతీయపరమార్థవాహినియే ఈనాటి సత్యసాయి ప్రబోధవాహిని యొక్క మూలతత్త్వము. నాటి నుంచి వస్తున్న సనాతన పరమార్థతత్త్వమే నేటి అధునాతనమైన సత్యసాయి ప్రబోధవాహిని. భారతీయ జీవనంలోని అనంతమైన ఆత్మను, ఆత్మస్వరూపాన్ని ఆవిష్కరించారు భారతీయపరమార్థవాహినిలో. ఈ వాహినిలో విజ్ఞాన సరస్వతి వీణమీటులు వినిపిస్తాయి.

మన సాధక వృత్తిలో ఈ దిగువ అంశాలు భారతీయ పరమార్థవాహినిలో లభించే ఆణిముత్యాలు.

## మన దుస్థితికి మనమే కారణం

భగవాన్ బాబావారి ప్రబోధలలో అత్యంత ప్రధానమైనది "ఎవరినివారు ఉద్ధరించుకోవటమే". మన దుస్థితికి, మన మంచిస్థితికి మనము చేసుకొన్న గతకర్మలే మూలకారణం. కానీ, మన దుస్థితికి గ్రహాలు కారణమనీ, లేదా మరెవ్వరో కారణమనీ ఎంచటము అజ్ఞానం. మనకు సంకల్ప శక్తి అనేదానిని భగవంతుడు ఇచ్చాడు. దీనిని 'ఇచ్ఛా' అనికూడా అన్నారు. స్వ - ఇచ్ఛ— (స్వేచ్ఛ), అదే 'మానవేచ్ఛ' మానవేచ్ఛద్వారా మానవుడు సాధింపజాలనిది లేదనేది బాబావారు చెప్పే సిద్ధాంతం. ఇదే పురుష ప్రయత్నం (పౌరుషం)గా భగవద్గీతలో వివరింపబడినది. ఈ పౌరుషం భగవదంశమే అంటుంది గీత. మానవేచ్ఛ సర్వ స్థితిగతులకు అతీతం. అత్యంత బలిష్ఠం, మహత్తరం, అనంతం అయిన మానవేచ్ఛ మానవ స్వాతంత్ర్యానికీ, కర్మ సూత్రానికికూడా ఫలం అన్నారు ఈ వాహినిలో. వ్యక్తిగతంగా, సామాజికంగాను ఒక ఉజ్వల భవితవ్యం నిర్మించుకోవటంలో ఈ సందేశం మనల్ని ఎం వ పరుస్తుంది. ఈ సాధనలో మనకు భగవానుడే అండగా, జంటగా ఉండగా ఇంక మనకేమి తక్కువ? దీనిని గుర్తించి మన సంకల్పమును ఉన్నతమైన ఆశయాలవైపు మళ్ళించటమే మనం చేయవలసిన సాధన. 'భారతగీతోపాసన' శీర్షికలో ఈ మానవేచ్ఛ యొక్క మహత్తును భగవాన్ బాబావారు ఎంతగానో విశదీకరించారు.

## పుస్తకములు ఎందుకు చదవాలి ?

పుస్తకములను చదవటంద్వారా మనలో తెలివి తేటలు పెరగటం ప్రధానంకాదు. తెలియని విషయాలు తెలుసుకోవటంకాదు. మనలో క్రొత్త క్రొత్త భావాలు కలిగి, అవి మన ఆలోచనలను ప్రభావితంచేసి, చివరకు ఆయా భావాలు మన నిత్య ఆచరణలో ప్రతిబింబించడానికి మనం పుస్తకములు చదవాలి అంటారు భగవాన్ బాబావారు భారతీయపరమార్థవాహినిలో. భావం ఎట్టిదో బ్రతుకు, ప్రపంచం, సృష్టి అట్టివే. దైవం, ప్రకృతి, సృష్టి, జీవుడు, కర్మ, బంధం, మోక్షం, ఆత్మ, పరమాత్మ, జననం, మరణం—అనే విషయాలను గురించి మనకుగల భావాలేమిటి? ఎందుకు సంకీర్తనలుచేయటం? ఎందుకు దైవారాధన? ఎందుకు సేవ చేయటం?— మొదలైన అంశాలపైన, ఇంకా మన నిత్య జీవిత విధానంపైన మనకుగల భావాలు ఏమిటో పరిశీలించుకొనాలి. ఈ భావాలే మన సాధనకు బలం చేకూర్చుతాయి. అందుకే పుస్తకములు చదవాలి. స్వామి ఎన్నెన్నో ప్రబోధాలు అనుగ్రహిస్తున్నారు. అవన్నీ పుస్తక రూపములోకి వస్తున్నాయి. సేవచేసే వారికి పుస్తకములు చదివే తీరిక ఎక్కడ ఉంటుందండీ అని సాయి సేవకులు ఎవరైనా అనుకుంటారా? అలాఅనుకోరు. అందుకే మన అధ్యయన మండలులు ఏర్పడ్డాయి. భావాలు మన అనుభూతులు కావాలి, అందాకా చదవాలి.

## స్థితిశీలంకాదు — గతిశీలం

భారతీయపరమార్థవాహినిలో భగవాన్ బాబావారు 7వ ప్రబోధంలో ఒక ముఖ్యమైన అంశాన్ని ప్రస్తావించారు, "ఎంతో కాలం నుండి భారతదేశంలో ఆస్తిక ధర్మము స్థితిశీలమై ఉన్నది. దానిని ఇప్పుడు గతిశీలము చేయవలెను" అన్నారు భగవాన్. తాము అవతరించినది కూడ మన ఆస్తిక ధర్మాన్ని 'గతిశీలం చేయడానికే' అన్నారు. స్థితిశీలం అంటే కదలకుండా Staticగా ఉండటము. గతిశీలం అంటే కదలని దానిని కదిలేటట్లు చేయటం Dynamicగా ఉండటం. స్తబ్దతకాదు కావలసినది చైతన్యం. ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా ఆధ్యాత్మిక ఉద్యమము విస్తరిస్తోంది. ఈ ఉద్యమంలో గొప్ప గొప్ప రాజభవనముల నుండి నిరుపేదల కుటీరములు కూడా తమ తమ పాత్రలను వహించాలి అన్నారు భగవాన్ బాబావారు. ఈ పరిణామంలో మనలోని ప్రతిఒక్కరంకూడా మన పాత్రను సముచితంగా నిర్వహించాలి. ఈ నిర్వాహణ కొరకు మనం సాధకులం కావాలి.

## మీరు మీరుగానే జీవించాలి

ఇదికూడా వ్యక్తిగతసాధనలోని ఒక ప్రధానమైన అంశము. 7వ ప్రబోధంలో ఈ సందేశం వివరింపబడింది, "మీరు మీరుగానే జీవించాలి. ఇతరులుగా మారరాదు. మీ స్వభావము నుండి మిమ్మెవ్వరునూ తొలగించకుండునట్లు చూచుకోవలెను" అన్నారు భగవాన్. మీరు మీరుగానే ఉండవలెను, అంటే ఒక అజ్ఞాని అజ్ఞానిగానే బ్రతకాలని అర్థంకాదు. ఇంతో అంతో విజ్ఞానం కలిగిన సాధకులు, బుద్ధిమంతులు, జ్ఞానులు తమకుగల విజ్ఞానాన్ని ఇతరుల ప్రభావంచేత కోల్పోరాదనే అంశాన్ని బాబావారు చక్కగా వివరించారు. ఒకసారి దివ్యజీవన మాధుర్యాన్ని రుచి చూచి కూడా భౌతిక పరిణామాన్నిచూచి భ్రమించి ఆధ్యాత్మిక విలువలు పోగొట్టుకొనే వారుంటారు. వారిని ఉద్దేశించి భగవాన్ ఈ మాటలన్నారు, ఆలాంటివారే నిజముగా దురదృష్టవంతులు. "మిమ్మెవ్వరునూ మీ స్వభావము నుండి తొలగించకుండునట్లు చూచుకోవలెను" అన్నారు బాబా. మన స్వభావం ఏమిటి? ఆధ్యాత్మికం. ఆధ్యాత్మిక మార్గం అంటూ ఒకటి లేదు. సమస్తమునూ ఆధ్యాత్మికం చేయాలి అన్నారు బాబా. అటువంటి స్థిరమైన మన దృక్పథాన్ని ఎవ్వరూ భ్రమింప జేయలేరనే స్థితికి దృఢపడాలి మనము. దీన్ని "దృఢభూమిక" అంటారు. 'అచ్యుత' స్థితి కూడా ఇదే. మనం ఈ

స్థితిని పొందగలిగినప్పుడే లోకం కూడా మనల్నిచూచి మన మార్గమును అవలంభించుతుంది. ఏ గాలి కొడితే ఆ గాలికి కొట్టుకొనిపోయేరీతి కారాదు మనసాధన.

## విశ్వాసానికి మరొక నిర్వచనం

పరిస్థితుల ప్రభావంచేత కొన్ని బలహీనతలు, కొన్ని దుష్బుద్ధులు, కొన్ని అవలక్షణాలు ప్రతి మనిషి లోను ఉండవచ్చును. కానీ, ఈ లక్షణాలు మనిషి యొక్క యథార్థమైన లక్షణాలుకావు. ఇవన్నీ తొలగి పోతే—— యథార్థ లక్షణం మనిషిలోగల దివ్యత్వమే. కనుక నేను పాపినికాను - నేను దివ్యాత్మస్వరూపుణ్ణి, నేను బలహీనుణ్ణికాను - అజేయమైన ఆత్మ శక్తిని, నేను దుఃఖాన్నీ, బాధలను అనుభవించే అల్పుడను కాను ఆనందస్వరూపుణ్ణి ఈ రీతిగా మన యొక్క యథార్థతత్త్వాన్ని మనం అనుక్షణం గుర్తుచేసుకోవాలి. ఈ నిజతత్త్వంలో విశ్వాసము కలిగి ఉండటమే ఆత్మవిశ్వాసం. ఇది కలిగి ఉన్నప్పుడే మనకు విజ యము, పురోభివృద్ధి, ఉన్నతి అన్నారు భగవాన్ బాబా. నేటి మన పతనానికి కూడా కారణం ఇలాంటి విశ్వా సము లేకపోవటమే. ఆత్మవిశ్వాసమే దైవవిశ్వాసం. ఇదే భారతీయ పరమార్థతత్త్వం అన్నారు భగవాన్ బాబా 6వ ప్రబోధంలో. ఈ యథార్థతత్త్వాన్ని గుర్తుం చుకోవటమే నిజమైన 'మననం' అన్నారు బాబావారు. ఈ రీతిగా మననం ద్వారానే ఆత్మవిశ్వాసము మనలో దృఢపడుతుంది. మననం అనేదానిని ఏవోశాస్త్రవచనాలు వినటం, విన్న దానిని 'మననం' చేయటము వరకే మనం పరిమితం చేస్తున్నాము. మన నిజతత్త్వమును ఎల్లప్పుడూ గుర్తుంచుకోవటం కూడా మననమే.

## క్షేత్రం సిద్ధంగా ఉండాలి

ఒక పంటను పండించాలంటే నేలను బాగా దున్నాలి, సాగుచేయాలి. అలాగే ఆధ్యాత్మికమైనపంట పండాలంటే మన శరీరమనే క్షేత్రాన్ని సిద్ధంచేసుకొని ఉంచాలి. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగంలో భగవద్గీతలో ఈ శరీరం క్షేత్రం ఎలా అయిందో వివరించబడినది. క్షేత్రం సిద్ధం కాగానే బీజాలు కూడా అప్పుడే ప్రాప్తి స్తాయని భగవాన్ బాబావారు ఈ వాహినిలో వివరి స్తారు. శిష్యునిలో ఆధ్యాత్మికమైన సంసిద్ధత ఏ క్షణ ములో కలుగుతుందో, ఆ క్షణంలోనే సద్గురువు కూడా శిష్యుని ఎదుట అవతరిస్తాడు. ఎంతటిగొప్ప గురువు దొరికినా శిష్యునిలో ఈ రీతిగా సంసిద్ధత లేకపోతే నష్ట పోయేది గురువుకాదు గదా. ఈనాడు సకల మానవాళి కొరకు భగవంతుడే ప్రబోధావతారస్వరూపుడైన శ్రీ సత్యసాయిగా అవతరించాడు. మానవ రూపోపాధి లోని ఈ విశ్వగురువు తన యొక్క క్రీగంటి చూపు చేతనే అధమాధముని సైతము జ్ఞానసిద్ధునిగా పరి వర్తించగల సమర్థుడు. భారతీయపరమార్థవాహిని యథార్థ ద్రష్ట, స్రష్ట ఈ విశ్వగురువే. అటువంటి భగవాన్ ఎదుటజీవిస్తూ మనము ఆధ్యాత్మిక తేజస్సును పొందుతున్నాము. ఈ ప్రయోజనము పొందకపోతే మనవంటి దురదృష్టవంతులు ఉండరు. ఇటువంటి విశ్వగురువు అద్వితీయ పాత్ర భారతీయ పరమార్థ వాహిని ముగింపు ప్రబోధంలో భగవాన్ బాబావారిచేత అభివర్ణింపబడినది.

## భారతీయ పరమార్థ వాణి

నాడు ఘోషింపబడినది నేడు ఉద్ఘోషింపబడు చున్నది, నాడు ధ్వనించినది నేడు ప్రతిధ్వనింపబడు చున్నది, అదే అమరవాణి, అదే వేదవాణి, అదే సనాతనవాణి, అదే ఈనాటి సాయివాణి.

ఈ సాయివాణి విన్నవారు ధన్యులు. విని ఆచ రించుచున్న సాధకులు మరింత ధన్యులు. సాధనలో సఫలత చెందుచున్నవారు ధన్యతములు. ఏమిటీ పర మార్థ వాణి ? ఏమిటీ సాయివాణి ?——

" అమృత పుత్రులారా! వినండి.... భ్రాంతికిని, అంధకారమునకును ఆవలినుండు పురాణపురుషుని (పరమాత్ముని) భారతీయ మహాఋషులు కనుగొని ఈ విధముగా జవాబు చెప్పారు, మానవ జీవులారా! సోదరులారా! మీ మరణ పరంపరల నుండి విముక్తులగుటకు అతనిని తెలుసుకొనుట ఒక్కటే మార్గము. నిత్యానందమునకు ఉత్తరాధికారులైన మీరు పాపులమని తలచకుడు. మీరు ఈశ్వర ప్రతిబింబములు. అవ్యయానందముకు పాల్గొను పావనులు, పరిపూర్ణులు, భూమిపై విహరించే దేవతలు. అట్టి మిమ్ము పాపులని పిలుచుట కంటే వేరొక పాపమున్నదా? పాపులమని అంగీకరించుట అప్రతిష్ఠ. లే-లెండు! మీరుగొఱ్ఱెలమను భావములనువీడి, భ్రాంతిని వదలిన ఆత్మలు. ఆద్యంత రహితులగు అమృత బిందువులు. భౌతిక పదార్థము మీ దాసి, కానీ మీరు దానికి దాసులుకారు. ఇవి ఋషుల వాక్యములు ".

భారతీయపరమార్థవాహిని ఈ రీతిగా భగవాన్ బాబావారిచేత అనుగ్రహింపబడిన పారమార్థిక విజ్ఞానసారం. సాధకులమైన మనము ఈ సారాన్ని స్వయంగా పొందటం జన్మ జన్మాంతర సుకృత తపః ఫలం. అదే మహాభాగ్యం, అదే జన్మచరితార్థం.

—పాతూరి ప్రసన్నం
సికింద్రాబాద్.



## శ్రీ సత్యసాయి గురుకులం, రాజమండ్రి — 533 101
## 1991—92 విద్యా సం॥ములో ప్రవేశములు

మా వసతి పాఠశాలలో తమ బాలురను చేర్పించగోరు తల్లిదండ్రులు— కరస్పాండెంటు, శ్రీ సత్యసాయి గురుకులం, రాజమండ్రి - 533 101 చిరునామాకు 21-3-1991 తేదీలోగా రూ॥ 15/—లు మానియార్డరు ద్వారాగాని, డిమాండుడ్రాఫ్టు ద్వారాగాని పంపి దరఖాస్తు ఫారం, ప్రాస్పెక్టస్ పొందవచ్చును.

ఈ క్రింద చూపబడినట్లుగా బాలురకు మాత్రమే ప్రవేశము కలదు.

ఇంగ్లీషు మీడియమ్ — 1వ తరగతికి 36 మంది, 2వ తరగతి నుండి 8వ తరగతి వరకు తరగతికి 5 మంది బాలురకు ప్రవేశము కలదు.

తెలుగు మీడియమ్ : 1వ తరగతికి 36 మంది, 2వ తరగతికి 30 మంది, 3వ తరగతికి 15 మంది, 4వ తరగతి నుండి 6వ తరగతి వరకు తరగతికి 5 మంది, 7వ తరగతికి 6 మంది, 8వ తరగతికి 15 మంది బాలురకు ప్రవేశము కలదు.

కరస్పాండెంటు.